# తొలిపలుకు

విశ్వప్రపంచమున వెలయు సహస్రాధిక పవిత్రవంశములలో సూర్యవంశము ప్రథమగణ్యము. సప్తసముద్రములలో క్షీరసాగరమును, దేవతలలో చతుర్భుజ మహావిష్ణుఁడును, గ్రహములలో భాస్కరుఁడును, లసంఘమున మేరువును, పురములలోఁ గాశికానగరమునువలె సూర్యవంశ మఖిల లోకవంద్యము.

పరమప్రాభవ వైభవపటిష్ఠమగు భానువంశప్రభువులలోఁ బ్రతాప సింహుఁడు శిరోవిభూషణ ఖ్యాతిఁ గాంచెను. భానువంశ ప్రతిష్ఠాప్రాభవములు రూపముఁ గైకొని ప్రతాపరాణాయై భాసిల్లినవి. ఏఁబదియైదు లక్షల పదాతిదళములోఁ, బదునైదు లక్షల యాశ్వికవాహినిలోఁ, బదివేల ఫిరంగులలోఁ, బదివేల వారణసమూహములోఁ గూడిన ప్రపంచోన్నత ప్రబల సార్వభౌముఁడగు మహమ్మద్‌జలాలుద్దీనక్బరు సార్వభౌముని యన ద్వావింశతిసహస్రాశ్విక దళముతో నెదిరించి యిరువదియైదు వత్సరంబు లవిచ్ఛిన్నముగ సంగ్రామములు సాగించి నిజదేశ స్వాతంత్ర్యమును, నాత్మస్వాతంత్ర్యమును నిలుపఁబెట్టుకొనిన విశ్వ వీరచూడామణి రాణా ప్రతాపసింహుఁడు. ఈ మహాపురుషాగ్రేసరుని వీరచారిత్ర మఖండ భరతఖండమునకు గురుపూజాపీఠమై శాశ్వత యశోగౌరవముల నందుకొనియున్నది.

నా రచించిన 'రాణా ప్రతాపచరిత్రము' నామూలగ్రంథము పఠించి, మననముచేసి యీ రచయిత యీ వచనగ్రంథము రూపొందించినాఁడు. మూలగ్రంథమందలి కథాంశములను, భావములను వదలలేదు. క్రొత్తవానిని జేర్పలేదు. అంతయు యథాతథముగాఁ గైకొనఁబడినది.

కడపటి ప్రకరణములో మేవాడనుద్ధరింప నశేష ద్రవ్యమొసంగి యుపకరించిన 'భామాసా' విప్రుఁడని నేను వాడియున్నాను. టాడ్దొరగారి మూలగ్రంథమునఁ బర్షియానుండి భారతదేశమునకు బ్రాహ్మణులెందఱో రాకపోకలు జరిపినట్లు ప్రథమసంపుటము 24 పుటలో [illegible]రింపఁబడియున్నది. అందువలన నేనట్లు వ్రాసితిని. ఈ సంజ్ఞావాచకము సాంతమైనది. 1530 వ సంవత్సరమున, కుంభల్ మియార్ గుర్గాధిపతి [illegible] 'రసాసా' యని యున్నది. — 'పాదుసా' యిట్టి శబ్దము ... [illegible] బట్టి కులనిర్ణయము గావించుట కష్టమే! కావున నీ విషయము భాషా ప్రత్యేకాధికారము గలవారును, చారిత్రక పరిశోధకులగు కోవిదులును తెలిసి నిర్ణయింపవలసినది.

ఈ గ్రంథకర్త యెందేనియుఁ గఠిన శబ్దములను వాడక, దీర్ఘ [illegible] సమాసముల వంకకుఁ బోక సరసశబ్దములతో, ప్రసన్న [illegible] నంతయు సాగించియున్నాఁడు. కథాంశము లాకర్షకములుగా నున్నవి. చావుటా-ఫర్మానా-రోజులు— మొదలగు నన్యదేశీయములు కొన్ని [illegible] వచ్చుచున్నవి. వాఙ్మయము సర్వతోముఖముగ వ్యాప్తినొందఁ [illegible] నీకాలమున నీ మార్గము నంత నిశితముగఁ జూడవలసి యుండ[illegible]!

[illegible] కల్పనల వంకఁబోక, సత్యమైన చరిత్రాంశములను దలచి ప్రేమించు నీ కవిహృదయము నభినందించుచున్నాను. సత్య చరిత్రపఠన [illegible] దేశాభ్యుదయకారకము.

ఈ కవి యింకను నిట్టి ఘనచరిత్ర గ్రంథములను రచించి భాషా సేవఁగావించుగాతమని కోరుచు నింతటితో విరమించుచున్నాను.

ప్రొద్దుటూరు, 25–12–51. — ఇట్లు,
కవిసార్వభౌమ డి. రాజశేఖర శతావధాని.

# విషయసూచిక







# అంకితము



గగన భూత రత్న మృగధర ప్రథితాంగ్ల
వర్ష విజయ దశమి పర్వ మందు
రమ్యమైన యట్టి రాణా ప్రతాప సిం
హుని చరిత్ర నిడితి వనజ నాభ!

# రాణా ప్రతాపసింహ

## 1. అభ్యుదయము

మహాపురుషులు ధర్మసంస్థాపన మొనరించుటకు, నధర్మము నశింపఁజేయుటకు నుద్భవించుచుందురు. ధర్మము నశించి, సత్యము కృశించి, నీతి నిలుకడ లేని దినములలో మహనీయు లుదయించి, తమ యమూల్యకృషివలన లోకమునకు శాంతిసౌఖ్యములు సాధింతురు. మిన్నువిఱిగి మీఁదఁ బడుచున్నను, ప్రళయము తటస్థించినను నవతారపురుషు లాదర్శమునుండి యావంతయేని సంచలింపరు.

పవిత్ర భారతదేశము విజాతీయుల దండయాత్రలతోఁ గ్రుంగి, కృశించి, కూలారిన రోజులవి. ఆర్షరక్తము నరనరములలోఁ బ్రవహించు హైందవనరపతులు లజ్జాభిమానములు వదలి విదేశీయులకు, విజాతీయులకుఁ దొత్తులై, రాజ్యలోభమునఁ దనయలను, ననుజలను 'బీబీలఁ'గావించి, సర్వమతసామరస్యము నెఱపు చేల్లని కాలమది! ఐహికభోగములకు నగ్రస్థానమొసఁగు నా దినములలో నాముష్మికవిషయము లాలోచించు వెఱ్ఱివారలను వెదకఁబోవుట మనకును వెఱ్ఱినిగూర్చును.

అక్బరు తన పూర్వులవలె హింసతోఁగాక, బాంధవ్యముతో, స్నేహముతో భారతప్రభువులను వశపఱచుకొని,

వారిచేతనే తన్నెదిరించువారి నోడింపఁజేయుచుండెను. చుట్టఱికపుఁ బ్రేమములో వారు వెనుకముందు లాలోచింపక, అక్బరు విజయరథమునకు వాహనములై తమ రక్త బంధువులను యుద్ధములో గెల్చి యక్బరు సామ్రాజ్యమును విస్తరింపఁజేయుచుండిరి. అల్లాహో అక్బరు నాదములు, కృష్ణ కరీముల ఏకత్వము, రామరహీముల సమ్మేళనము పాదుసా విశాలదృష్టికిఁ దార్కాణములై యుండెను. సూర్యు నారాధించుచు, గంగాజలముఁ గ్రోలుచు, నుపనిషత్తుల వినుచు నక్బరు హిందూమత మారాధించు నా దినములలోఁ బ్రజలలోఁగాని, పాలకులలోఁగాని యసంతృప్తి, విచారము, కష్టము, బాధ యను మాట లెందును గానరాకుండెను.

అట్టి కాలమునఁ గావలయునని కష్టముల వరించినవాఁడు, విజాతీయులతోఁ బొత్తుగూర్చి రాజ్యమేలుట నీసడించుకొని, యడవులలో నాకలములు దిని, యిడుములఁగనినవాఁడు నొకఁడు గలఁడు. పారతంత్ర్యమున నార్జించు పాయసమునకన్న స్వాతంత్ర్యముతోఁ ద్రావు గంజి మేలని యాతని సిద్ధాంతము. దేశమునకు, దైవమునకు ద్రోహ మొనరించు నాగరకప్రజల నడుమ నుండుటకంటెఁ గ్రూరమృగముల దండనుండుటయే శ్రేయమని యాతని విశ్వాసము.

ఆతఁ డెవఁడో మీ రెఱుఁగుదురా! అతఁడే రాణా ప్రతాపసింహుఁడు. సూర్యవంశ కీర్తిప్రతిష్ఠలకు మూలకారణమైన శ్రీరామచంద్రుని కుమారుఁడగు లవకుమారుఁ డీతనికి మూలపురుషుఁడు. రసపుత్ర పౌరుషమునకుఁ గాణాచియైన చిత్తూరీతని జన్మస్థలము. పద్మినీ—భీమసింహులు, మీరా—

కుంభరాణా లీతని యారాధ్యదైవతములు. సంగ్రామసింహుఁ డీతని తాత. మొగలుపాదుషా యక్బరు దండెత్తి వచ్చుచున్నాఁడని వినినంతనే నలువురతోఁ బాటు రణభూమికరిగి, వైరిసేనలఁజూచి గడగడలాడి, కాళ్లుచేతులు చల్లఁబడి, మొగలులకు ఖైదీయైన తనభర్త నుదయసింహుని పగతుర నుండి విడిపించి, రణదుర్గయై యరివీరులఁజించి చెండిన రాజ్ఞి వీరాబాయి యీతని కన్నతల్లి.

ప్రతాపసింహుఁడు తన బాల్యమునుండియు భయమన నెట్టిదో యెఱుఁగఁడు. అతఁడు కల్యాణగుణరత్నాకరుఁడు. యవనులపాలైన చిత్తూరును స్వాధీనపఱచుకొనుట కహర్నిశము లాలోచించుచు బలవంతులైన భిల్లులతోఁ జేయికలిపి స్వాతంత్ర్యరణమొనరింప నుద్యుక్తుఁడగుచుండును. అక్బరునకు వెన్నిచ్చి పాఱిపోయివచ్చిన తన తండ్రి యుదయసింహుని భీరుత్వము నాతఁడు గర్హింపని నిముసమే లేదు. తన తోఁబుట్టువు లిరువది నలువురును దనతోఁ గలసిరాకపోయినను, నేకాకియై రణసన్నాహము లొనరించుచు భిల్లులను సిద్ధపఱచుచుండెను.

ప్రస్తుత కథాకాలమునాఁటికిఁ బ్రతాపుని తండ్రి యుదయసింహుఁడు చిత్తూరునకు హస్తోదకమువదలి, యుదయసాగర ప్రాంతమునఁ దనపేర నుదయపురము నిర్మించుకొని కాఁపురముండెను. ప్రతాపుని పౌరుషస్ఫూర్తి యుదయసింహునకు దివాంధమునకు సూర్యుని కాంతివలె నుండెను. ప్రతాపునిఁ దన మార్గమునకుఁ ద్రిప్పవలయునని యాతఁడెంతయో ప్రయత్నించెను. కాని తన ప్రయత్నము ఫలింప

నందువలనఁ దనమాట వినని తనయుఁ డేలయని తలఁచి, పెనవికి మించిన పంటినుంచుట శ్రేయస్కరము కాదని యా వివేకిశిరోమణి రాణా ప్రతాపుని బహిష్కరించెను.

ఇఁక నుదయసింహుని రెండవ కొడుకు సూక్తుఁడు. పూర్వ మొకనాఁడు రాణా కొలువుఁదీర్చియుండ, నొక లోహకారకుఁడు వచ్చి, రాణా కొక కత్తిని బహుమతిగా నిచ్చెను. దాని పదనుఁజూడఁదలఁచి రాణా దానితో నొక పుడకను జెక్కి ప్రక్కనుంచెను. అప్పటి కైదేండ్ల బాలుఁడగు సూక్తుఁడు చెంత నాడుకొనుచుండెను. అతఁడు తండ్రిచేసిన పనినిజూచి దరికేగి, "నాయనా! రణరంగమునఁ బగవారిని జంపుటకుఁ గత్తు లుపయోగింతురు గాని వానితోఁ బూచిక పుల్లలు చెక్కుదురా!" యని పలికి తనవ్రేలు గాయమొన రించుకొనెను. గొట్టముతోఁ జిమ్మినట్లు రక్తము గాఱి దిగువ నున్న రక్తకంబళము దడియుచుండ, సూక్తుఁడు నిశ్చల దృష్టితోఁ దండ్రివంకఁ జూచుచుండెను. సభాసదు లీ దృశ్య మునుజూచి యచ్చెరు వొందిరి. సహజభీరువగు రాణా కీ సంఘటన భయముఁ గలిగించెను. అతని మనస్సు కలఁత వడెను. "వీఁడు పరమసాహసికుఁడు. వీఁడు మనియున్న నేనాఁటికైన నన్ను వధింపకమానఁడు" అని బెదరిపోయి, సేవకులకు నైదేండ్ల సూక్తునిఁ జంపి రండని కటికయెడఁదతో నాజ్ఞాపించెను. వా రా బాలు నడవికిఁ గొనిపోయిరి. ఆ సమ యమున నాత్రోవనఁ బోవుచున్న సలుంబ్రాదేశపురాజు కృష్ణసింహుఁడు బాలునిఁ జూచి, విషయముఁ దెలిసికొని, తనయింటికిఁ గొనిపోయి, పుత్రప్రేమతోఁ బెంచుచుండెను.

చిత్తూరు దుర్గము చెడిన నాలుగేండ్ల కుదయసింహు
నకుఁ బెద్ద జబ్బువచ్చెను. అతనిఁ జూచుట కొకనాఁడు బంధు
మిత్రులు, మంత్రి సామంతులు నరుదెంచిరి. మరణశయ్య
పై నున్న రాణా వారినెల్ల దగ్గఱకుఁబిలిచి యిట్లు చెప్పెను :

"నేనిఁక బ్రతుకఁబోను. నా నోటమాట యున్నప్పుడే
నా సందేశమును వినుఁడు. నా యనంతరము మీరు చేయఁ
దగినపనులను జెప్పుచున్నాను. నా కిరువదైదుగురు కొడుకు
లున్నారుగదా! వారిలో రాజ్యార్హుఁడు – పెద్దవాఁడగు
ప్రతాపుఁడు నాకుఁ గాని పనులొనరించుచు, నాకుఁ బగవా
రగు భిల్లులతో స్నేహము చేయుచుండఁ, బెదవికి మించిన
పన్ను వలదని తలఁచి, వానిని విడనాడితినని మీ రెఱుఁగు
దురు కదా!

"ఇఁక రెండవవాఁడు సూక్తుఁడు. వాఁడు పసితనమునఁ
జూపిన సాహసము మీ రెఱిఁగినదే కదా! చంద్రబింబము
నుండి వెన్నెలలు జలజల పాఱుచున్నట్లు మోమునఁ జిఱునగవు
లొలుకుచుండ తొణఁకకుండఁ దనమొడ నెత్తురునైనఁ బ్రవ
హింపఁజేయఁగల క్రూరహృదయుఁ డాసూక్తుఁడు! ఆ కటిక
గుండెవాఁ డిల్లు వదలిపోవుటయే పదివేలని తలఁచుచుంటిని.
వానిని సలుంబ్రా రాజు పెంచుకొనుచున్నాఁడు. అట్టివానిని
రాణాగాఁ జేయఁదగునా? వాని కధికార మిచ్చిన వాఁడు నిప్పు
లేకుండ రాజ్యమెల్ల నిర్ధూమ మొనరింపఁగలఁడు.

"ఇఁక మూఁడవవాఁడు సాగరుఁడు. వాఁడు మూర్ఖు
లలోఁ బ్రథముఁడు. ఇరువదైదేండ్లు నెత్తికి వచ్చినను
ఇంటనుండక విచ్చలవిడిగఁ దిరుగుచు నాలుక దురదతోఁ

బిచ్చివాగుడు వాగి కొట్లాటలు దెచ్చుచుండును. వానికే రాజ్యమిచ్చిన, వాఁడు డబ్బిచ్చియైన రణము కొని తేఁగలఁడు. ఆ కోఁతివికట్టి రాజగుట మీకు సమ్మతమేనా? నాలుగవవాఁడు నరహరి. వాఁడు పెంకెవాఁడు. వానిని యింటఁబెట్టిన వాన కురువదు; నేలఁబెట్టినఁ బంటపండదు. వాఁడు పిలిచిన పలుకఁడు; దరికరిగినఁ బరువెత్తును. వాఁడు నరహరి గాఁడు; నా ప్రాణహారి! నా యిరువదైదుగురు కొడుకులలో నిరువది నలువురకు నిట్టి యవగుణములే కలవు.

"ఉన్నవారిలో నెల్ల జగమల్లుఁ డొక్కఁడే యిది నాదని యెఱిఁగి కాఁపురము దిద్దుకొనఁగలిగిన బుద్ధిమంతుఁడు. ఎప్పుడు నింటనుండి యింటిపనులు చూచుకొనుచుండును. అందఱితో మనసిచ్చి మాట్లాడును. ఆఁడువారి నలక్ష్యపెట్టక వారికి ననుకూలముగఁ బ్రవర్తించుచుండును. మఱియు, శౌర్యము వీర్యమని ప్రజ్ఞలు పలికి తలకు మించిన పనులకుఁ బోఁడు. భయభక్తులు గలవాఁడు. వాని నొక్క నిముసము చూచిన మీరందఱును వానిని సజ్జనుఁడని, రాజ్యార్హుఁ డని యనక పోరు. తండ్రినగు నేను వానిని బొగడఁగూడదు గాని, నిజముగ వాఁడే 'మేవాడ'కు నా పిదప రాజు కాఁదగువాఁడు. మీరెల్లరు నామాటలను విని నాయనంతర మతనిని రాజుఁజేయుఁడు. జగమల్లుని రాణాగాఁ జేసెదనని కృష్ణసింహుఁడు నా చేతఁ జేయినుంచిన నేను శాంతముగఁ గన్నుమూసెదను."

ఆ మాటలు విని కృష్ణసింహుఁ డుదయసింహునితో "నీ యాజ్ఞను బాలించి జగమల్లునే రాణాఁ జేసెదను. అతని

పైన నీఁగనైన ప్రాలనీయక కాపాడెదను. మీరు శాంతి మెయి దైవప్రార్థన మొనరించుకొనుఁ” డనెను. రాణాకోరి కకుఁ గృష్ణసింహు నంగీకారమున కచ్చటి వారెల్ల విచారించిరి. పెట్టిభాగులవాఁడగు రాణాకోరికకుఁ గృష్ణుఁ డంగీకరించుట యచ్చటివారికి నచ్చుమని పిడుగాయెను. కాని, ప్రతాప వంతుఁడగు కృష్ణుని మ్రోలఁ దమ యసంతృప్తిని వెల్లడింప సాహసింపరైరి.

“ఔరా! పెద్దకొడుకను - ప్రతాపుని వ్యర్థముగ నీ రాణా రాజ్యభ్రష్టునిఁ గావించెను గదా! ఏమి యీ రాణా యవివేకము? తందానతాన యని తలయూఁపెనే యీ సచివ శేఖరుఁడు! ఆహా! ఎద్దీనిన దన్నఁ గొట్టమునఁ గట్టుమన్న ట్లున్నదే! ఓ సూర్యవంశమా! నీ వెంత దిక్కుమాలినదాన వైతివి! ఆనాఁడు దశరథుఁడు పెద్దకొడుకునుగాదని భరతునకు రాచఱికము గట్టఁబెట్టినందున రాముఁడు పదునాలుగేండ్లు రాజ్యమును మానుకొనవలసివచ్చెను. ఈ నాఁడు ప్రతాప సింహుఁడు రాజ్యాధికారమును గోల్పోయెనే! తంత్రులు బలహీనులై యెంతెంత పనులు చేయుచున్నారు!” అని ప్రజలు, రాజబంధువులు విచారించుచుండిరి. ఆ మఱునాఁటి రేయి రాణా మరణించెను. వారి సంప్రదాయము ననుసరించి, రాణా శవమును పురోహితునింట విడువ నతఁడు పారలౌకిక క్రియల యథావిధి నొనరించెను.

నగరులోఁ బట్టాభిషేక సన్నాహములు గావింపఁ దొడఁగిరి. బహువిధాలంకారములతో సభాభవనము సుధర్మాస్థానమును దీటుకొనుచుండెను. సభాభవనమున

నాలుగు కోణములు గల సమతలమందు వేదిక గలదు. దాని నడుమ సింహాసనము నేర్పఱచిరి. వేదికకుఁ దూర్పు దిక్కుకొనను నవరత్నములు పొదిగిన బంగారు పిడిగల సూర్యధ్వజమును స్థాపించిరి. రాజాధిరాజులు సభాంగణమునఁ గుడిప్రక్కన నిలిపిన గద్దియలపైనుండిరి. ఎడమప్రక్క పీఠములపై సామంతరాజు లుండిరి. వారివెనుకప్రక్కన రాజబంధువు లున్నతోద్యోగులు కూర్చుండియుండిరి. సింహాసనమున కెదుట దూరమునఁ గవులు, గాయకులు, ప్రజలు, పండితులు, దైవజ్ఞులు నుచితాసనముల నలంకరించియుండిరి.

జగమల్లుఁడు క్రొత్తగుడ్డలు కట్టుకొని, సుగంధద్రవ్యము లలఁదుకొని, సభలోని కరుదెంచి, రాజదండమును గేలఁగీలించి సింహాసనము దరి కరిగి, "నేను రాణానైనాను. మీరెల్లరు నన్ను సేవింపుఁ"డని యధికారస్వరమునఁ బలికి కూర్చుండఁబోవుచుండఁ గృష్ణసింహుఁడు దగ్గఱకుఁబోయి, యుచితోక్తుల బుజ్జగించుచు, "నాయనా! ఇది నీది కాదు. ప్రతాపసింహునకుఁ జెందఁదగినది. దీని నీ వాక్రమింపఁదగునా? అతఁడిచ్చటికి వచ్చికూర్చుండఁగలఁడు. నీవులేచి దూరమునకుఁ బో. అదియునుగాక, రాజు కాఁదగినవాఁ డుదయమందే దేవతార్చన మొనరించి ముహూర్తమునకు రాఁదగునుగాని, ముందే వచ్చి కూర్చుండఁదగునా?" యనెను.

జగమల్లుఁడు :—(కనుబొమల ముడివైచి) ఆహా! ఏమి నీ యుపదేశము! చాల బాగుగనున్నది. ఆ నాఁడు మా తండ్రిమాటలకుఁ దలయూఁచి, యీ నాఁడు నన్ను లేచి పొమ్మనుటకు నీకు నో రెట్లాడెను? ధర్మసూక్ష్మము లెఱుఁగ

కున్నావే? మా తండ్రి యెవనిని రాజుగా నియమించెనో వాఁడే రాజ్యార్హుఁడగునుగాని, యితరుఁడర్హుఁడా? మాతండ్రి నన్నే రాజు నొనరింపుమని నీతోననలేదా? నీ వానాఁ డంగీకరింప లేదా? ఆ నాఁడీ సభ్యులెల్లరు లేరా? మా తండ్రి మాట దాఁటి నీ మాట విందునా? ఈ వెఱ్ఱిమొఱ్ఱ పలుకులను గట్టిపెట్టుము. నీ వాక్యములు నాకుఁ గర్ణశూలములుగా నున్నవి. నే నూరకోనను. నన్ను వదలి యావలకుఁ బోయి యూరక ప్రేలక కూర్చుండుము. ఊరక గద్దింప నీ కెపు డీశాధ్యత వచ్చినది? నీ కీ నడుమంత్రపుఁ బెత్తన మెవ్వఁడు కట్టఁబెట్టినాఁడు? పోపో! దూరముగఁ బొమ్ము. మర్యాద దక్కదు.

కృష్ణుఁడు:—(నవ్వుచు) నాయనా! నీ వేల యింత తెలియనివాఁడ వైతివి? ఆ నాఁడు నీ తండ్రి ధర్మము వదలి నిన్ను రాజు నొనరింపుమన్నాఁడు. నాఁడు నేనేల తల యూఁపితి నందు వేమో, వినుము. రాణా యవసానదశలో నున్నాఁడే, ఇప్పుడేల యతని కప్రియములు పలికి, మనస్సునకుఁ గష్టము గలిగించుట యని తలఁచి తల యూఁపితిని. అంతియకాని, నీకు రాచరికము గట్టఁబెట్టఁదలఁచితి ననుకొంటివా? ప్రతాపుఁ డెక్కడ, నీ వెక్కడ? అతఁడ రాజ్యమేలు నర్హత గల వాఁడు. అతని బలపరాక్రమముల నేమని తలంచితివో! వానిని వారించుటకు నీ వెంతవాఁడవు? ఆ నాఁడు పూజ్యుఁడని తండ్రియానతిఁ దలదాల్చి, మౌనముతో నున్నాఁడుగాని, కోపించి విజృంభించినచో నెవ్వఁడాపఁగలఁడు? రవివంశ శిరోమణి కాఁదగు లక్షణములు ప్రతాపునియొద్దఁ గలవు.

మేవాడలో నింతటి గుణశాలి యింతవఱకు జన్మింపలేదు. చిత్తూరు రాజ్యలక్ష్మి తొలినోముల పంటగ నేకలింగేశ్వరుఁడే ప్రతాపుఁడై యవతరించెను. కోటి విఘ్నములనైన గోట మీటి ప్రతాపునిఁ బట్టభద్రు నొనరించెదను. ఇది నా దృఢ ప్రతిజ్ఞ.

పరవీర భయంకరుఁడై సంగ్రామసింహుఁడు రాజ్యమును బాలించెను. అతని పిదప దుర్బలుఁడు, పిఱికిపోతు నగు మీ తండ్రి రాజై చిత్తూరును మంటఁ గలిపి పాఱిపోయెను. మీ తండ్రి రాజైనదిమొదలు రాజ్యమునకుఁ గష్టములేకాని యొకనాఁడైన సుఖించితిమా? రణమనుపేరు వినిన నతని గుండెలు దడదడలాడి యతఁడు నూఱామడ పోవును. ఎటులనో యతని కాలము గడచిపోయినది. ఇఁక నీవో! తండ్రిని మించిన తనయుఁడవు. నీ రాచరికము కోఁతిచేతఁ దలఁ గోకి కొనినట్లుండును. నేఁటి దేశకాలములనాలోచించిన, విపత్తులో నున్న మేవాడ రాజ్యనౌకను సురక్షితముగ గమ్యస్థానమును జేర్పఁగలిగినవాఁ డొక ప్రతాపుఁడే. మూర్ఖమువానిఁ ప్రక్కకు తొలఁగుము.

జగమల్లుఁడు:—(పండ్లు కొఱకుచు) ఏమయ్యా! నీ యాటలు నాదగ్గఱ సాఁగవు. దూరముగఁ బొమ్ము. ఏమైనను సరే నేనీ స్థానము వదలిపోను. మా తండ్రి యానతిమేరకు నేనే రాజును. నీవు నన్ను కాదని ప్రతాపుని కెట్లు రాజ్యమిచ్చెదవు? రాజబంధువులు, సామంతులు నిన్ను శిక్షింపక మానరు. ఇందఱను నీ వొకఁడ వేమి చేయఁగలవు? (అని సామంతుల వంకఁ దిరిగి) ఏమయ్యా! మీ రేల కండ్లప్పగించి

చూచుచున్నారు? మీకన్న నాడంగుతే నయమే. ఒక యక్రమము జరుగుచుండ నాఁడువారు చూడలేరు. ఇతఁడేమో భీతిలేక వ్రేలుచున్నాఁడు. ఇతని వాగుడు నణఁగింపుఁడు. మీకేమైనఁ బ్రాణాపాయము వచ్చినచో మిమ్ము రక్షించుటకు నేనున్నాను. ముసలివాఁడైనను నితఁడీనిన పులివలెఁ బైపైకి దుముకుచున్నాఁడే! తానొకఁడే యింత బలము చూపిన మనమందఱముఁ గలసిన నెట్టి విచిత్రములు పుట్టఁగలవో! వ్రేలువాచి రోలంతయైన రోలువాచిన నెంతగునో!

కృష్ణసింహుఁడు "మేలుమేలు! తాతకు దగ్గులు నేర్పు మనుమఁడవైతివే! ఈ సభవారు నిన్ను రాణాచేసి నన్నెదిరింతురా? నీవలె వారికేమైన దయ్యముపట్టినదా? రోగాలము దాపురించినదా? రాణాలఁజేయు బాధ్యత సలుంబ్రా వారిదని యెఱుఁగని రాజపుత్రుఁ డెవఁడున్నాఁడు? ఇప్పుడు ప్రతాపుని నేను రాణా చేయుదును. కాదు కూడదనువారున్నఁ జేతులెత్తుఁడు. ఇది నాయింటికిఁ జేయుపనియా? ఈ క్లిష్ట పరిస్థితులలో యోగ్యుని రాజుజేసినచో నిత్యకల్యాణము పచ్చతోరణములతో రాజ్యము బాగుపడును. అయోగ్యు నధికారిని గావించినచో నాపద లలముకొనును. ఆ పాపము పెద్దలమగు మాపైనఁబడును. నాకితరులతోఁ బనియేమి? ఈ సలుంబ్రా కృష్ణుఁ డన్యాయముల కొడిగట్టఁడను పెద్దల దీవనలే నాకుఁ జాలును. ఈ మెత్తని మాటలతో దారికి రమ్ము. రాకపోయినచో నిన్నెత్తుకొని పోయెద"ననెను. ఆ యుత్తమోత్తముఁడు జగమల్లు బిఱ్ఱబిగిసికొని కదలకుండెను. కృష్ణుఁ డతని మెడబట్టి సింహాసనమునుండి దూరముగ నెట్టు

కొని పోయెను. ఏమిచేయుటకుఁ దోఁచక జగమల్లుఁ డీను రోసములు పెనగొనుచుండ రోఁజుచు, పులిచేతిలోఁ జిక్కి తప్పుకొననేఁటని గొణ్ణెవలెఁ గంటి సీటితోఁ, బేదమోముతో వాకిలి దాఁటిపోయెను.

"ఔరా! సలుంబ్రా కృష్ణుఁ డెంతటి ధర్మమూర్తి! చేఁజిక్కిన యవకాశమును దుర్వినియోగపఱుపక, అన్యాయమును నివారించి, ప్రజలకు సామంతులకు నిష్టుఁడగు ప్రతాపునకు రాజ్యార్హత నిర్ణయించెను. లోకమున నమృతము, మలయవాయువు, దర్పణము మాలిన్యమొందిన నొంద వచ్చునుగాని, సత్పురుషుల చిత్తములకు మాలిన్యము గలుగునా? వనితలకడఁజేరి ముచ్చటలాడుచు, వంటయిల్లువదలని జగమల్లుని వదలి మన మనస్సునకు నచ్చిన సూర్యవంశ వర్ధనుని ప్రతాపుని రాజు నొనరించు నీ కృష్ణసింగు వేయేండ్లు బ్రతుకునుగాక!" యని సామంతులు, ప్రజలు నభినందించుచుండిరి.

సలుంబ్రా కృష్ణుఁ డండఱను గైకొని ప్రతాపుని కడకేగి యాతనితో - "దేవా! నీవు వీరావతారుఁడవు. కష్టసుఖములు కావడికుండలని తలఁచుచుందువు. పరుల బాధలను జూచి యోరువలేవు. ముదిమిచే మది దప్పిన మీ తండ్రి రాజ్యాధిపత్యము నీకు నెడబాపి, మేరువును ద్రవ్వి తలకెత్తు కొడుకని జగమల్లుని రాజును గావింపఁ గోరెను. అప్పుడు వాదేలయని నే నూరకుంటిని. మొదటి నుండియు నా యాశలు నీయెడన కలవు. నీవు రాచరిక మూని పాలింపు" మనెను. ప్రతాపుఁడు నమస్కరించుచు "తండ్రీ!

మా తండ్రి తుదికోర్కె తీర్పకున్న నాచంద్రతారార్క మపకీర్తికి పాలుగానా? ధర్మవిరుద్ధము లాచరించి దేవేంద్రుఁడ నగుటకంటె నిరుపేదనై న్యాయవర్తనమున మెలఁగఁగోరెదను. రాజ్యము శాశ్వతమా? ధర్మము దైవమునలె శాశ్వతము కదా! తండ్రి పిదపఁ దండ్రివంటివాఁడవగు నీ యానతి మీఱఁ జాలకున్నాను. నా తండ్రి నీ భుజబలము బాసట చూచుకొని కదా గుండెలపై చేయి వైచికొని నిశ్చింతగ నిదురింపఁగలిగినది! నీవు లేని నాఁ డీ యుదయపురము లేదు; రాజ్యము లేదు; రాణా లేఁడు. తండ్రి యాజ్ఞ మీఱుదునా? నీయానతి నుల్లంఘింతునా? నా పని ముందు నూయి, వెనుక గోయిగా నున్నది.'' అనెను. అంతఁ గృష్ణసింహుఁడు ''నాయనా! ప్రతాపా! నీకుఁ గాక రాజ్యార్హత మఱియొకరికిఁ గలదా? నిన్ను జ్యేష్ఠునిగ సృజించి భగవంతుఁడే నీ రాజ్యార్హత నంగీకరించెను. కావున నీవు రాజవగుట ధర్మము. ప్రజ లెవనిని గోరుదురో వాఁడే రాజు గాఁదగు'' ననెను. అనుచరులెల్లరుఁ బ్రతాపునిఁ జూచి, యొక్కుమ్మడిగ ''రాజసింహాసనమునకుఁ బ్రతాపుఁడే యర్హుఁడు. ఇతఁడు కాదని వేఱొకని నింద్రునైనను, జంద్రునైనను, నుపేంద్రునైన సరే తెచ్చిన మేము సమ్మతింపము. మ మ్మితఁ డుద్ధరించు నను నాశాలతలు పుష్పించుచున్నవి. ఇతఁడెప్పుడు రాజగునా యని వేయికండ్లతో నెదురు చూచుచున్నాము,'' అనినఁ, గృష్ణుఁడు ప్రతాపునితో ''నాయనా! ఈ ప్రజావాణిని వింటివా? నీవు రాచరికము పూనకతప్ప''దని పలుకఁ, బ్రతాపుఁ డెట్టకేలకు సమ్మతించెను. పాటేశ్వరీ ప్రతాపులను బంగరు పీఠములపైఁ గూర్చుండఁబెట్టి హారభట్టారకుఁడు వేదమంత్ర

ములఁ జదువుచు నభిషేకము గావించెను. సురభిళజలముల జలకమాడి, పట్టుపుట్టములఁగట్టుకొని, మందారమాలలుదాల్చి, సూర్యభగవానుని నేకలింగేశ్వరు నర్చించి, గురులకు మ్రొక్కి యుచితపరివారముతోఁ బ్రతాపుఁడు సభాస్థానమున కరిగెను.

సభాభవనము కలకలలాడుచుండెను. ప్రతాపుఁడు పాటేశ్వరీదేవితో రోహిణీయుక్తుఁడగు చంద్రునివలె సింహాపీఠి నధిష్ఠించెను. కృష్ణసింహుఁడు ప్రతాపునినుదుట వీర తిలకము దిద్దెను; ఆదిశేషుని నాలుకవంటి కత్తిని నడుమునకుఁ గట్టెను; రత్నమకుటమును శిరమునఁ గీలించి చేతికి రాజ దండము నొసఁగెను. ప్రతాపుఁడు పూజ్యులకు మ్రొక్కి వారి దీవనలందెను. సభ ముగిసెను. ఎల్లరు గృహముల కరిగిరి.

## 2. కార్యనిర్ణయము

ఒకనాఁడు ప్రతాపుఁడు మేడపైఁ బులిచర్మమున నలలు లేని సముద్రమువలెఁగూర్చుండియుండెను. కిరాతనాయకుఁడు, భీమచాందు, సామంతరాజులు, సలుంబ్రాకృష్ణుఁడు నరుదెంచి, తేని కనుసన్నఁజెంత నాసీనులైరి. వారిని జూచి ప్రతాపుఁ డీ రీతిఁ బలుకఁ దొడఁగెను:

"లోకమునఁ బుట్టిన ప్రతివాఁడు తనయిల్లు, తన ప్రజలు, తాను, తనదేశము సుఖముగ జీవింపవలయునని తలఁచుచు దానికిఁ దగినట్లు ప్రవర్తింపవలయును. కాని దుర దృష్టవశమున మనదేశ మట్టి యదృష్టమునకు నోచుకొనలేదు. ఏడవ శతాబ్దినుండి యవనులు మనదేశమును గొల్లగొట్టు

చుండిరి. వారి దాడికి మన దేశము బాడయ్యెను. సిరిసంపదలు తఱిఁగిపోవుచుండెను. పాఁడిపంటలు మందగించెను, గోధనము కూలిపోవుచుండెను. వ్యాధులు, కాటకములు పెరుఁగుచుండెను. యవనులధాటికి వీరరసావతారులగు రాజశిఖామణు లెందఱో మరణించిరి.

"ఒక నాఁడా! ఒక మాసమా! ఒక సంవత్సరమా! దరిదాపు వేయేండ్లనుండి యంతులేని యీ దారుణకాండ జరుగుచున్నదే! గజనీ మహామ్మదు మొదలు అక్బరువఱకుఁ గల మహమ్మదీయ రాజులెల్లరును జేతనైనంత దేశమును సంక్షోభింపఁ జేసిరి గదా! మా మాతామహి తోఁబుట్టు వగ్గునరావు, నా ముత్తాత సంతతివాఁడు దుర్గారావు వీరవిహార మొనరించి యవనుల వంచనకు బలియైరి. మా యవ్వ జవహరబాయి మహిషాసురమర్దనివలె వీరవిహార మొనరించి వీరశయనమందెను.

"మేవాడమాత శాత్రవ దండయాత్రలతో సడలిపోయి కన్నులలోఁ బ్రాణము లుంచుకొనియున్నది. ఏడాది కేడాది కెందఱెందఱో మానవతులు బంగారు సలాకలవలె నగ్గిలోఁబడి బుగ్గి యగుచున్నారే! ఎందఱెందఱో వీరవరేణ్యు లంతరించి పోవుచున్నారే! మన మేవాడతల్లి దైన్యదశ తలఁచిన నా యెడ లుడికిపోవుచున్నది. ఆమెను రక్షించుట కేమియు నుపాయము దోఁచక వెతలందుచున్నాను. దీనికిఁ దోడు మనలో ననేకులు దేశద్రోహులు, మాతృద్రోహులు, కులద్రోహు లుద్భవించిరి. తొలుతనే మా వాఁడు భగవాన్ దాసు తన కూఁతురు నక్బరునకు రాణీగ, తనయుని గులా

ముగఁ జేసెను. తనంతవాఁడు లేఁడనిపించుకొనిన యుదయ సింహుఁ డక్బరు కెదురేగి రాజ్యమును, స్వాతంత్ర్యము నతనికి నీరాజనము గావించెను. చెల్లెలి నక్బరు కిల్లాలు గావించి కొలువుకాఁడాయెను. బికనీరు పృథ్వీరాజు తనయు నక్బరున కొసఁగి వానికి సామంతుఁడాయెను. మా తండ్రి మేనమామ కొడుకగు నర్జునరావు తనయుఁడు వంశప్రతిష్ఠను గంగలోఁ గలిపి పగవాని పాదము లాశ్రయించెను. పేరు గల దొరలే సిగ్గుమాలి తగ్గుకూటి కాశ్రయించినారే!

"నా కన్నుసన్నలలో మెలఁగవలసినవారెల్ల రహితులకుఁ దొడైరి. భాండారములు శూన్యములాయెను. హారావళి కొండలే మనకు మిగిలినవి. భూదేవికి మకుటమైన మేవాడ దురవస్థఁజూచి చీము నెత్తురులు గలవాఁ డెవఁ డోర్చుకొనఁగలఁడు? విధి కెదురొడ్డి స్వాతంత్ర్యలక్ష్మిని స్థాపింపఁ జూచు నన్ను సముద్రమున కేతమెత్తఁ జూచువాఁడని లోకము పరిహసించినఁ బరిహసించును గాక! ఇదే నా తుది నిశ్చయమును వినుఁడు. ఉదయపుర రాజ్యలక్ష్మికి స్వాతంత్ర్య కిరీటముఁ గూర్చనైనఁ గూర్చెదను. లేదా దైవోపహతుఁడనై నా నెత్తురుతో నభిషేక మొనరించెదను. నా కించుక కష్టమైన నోరువఁజాలని మీ యాశీస్సు నాకు శ్రీరామరక్ష యగును గాక! ఇందలి ధర్మసూక్ష్మముల నాలోచించి కర్తవ్యము నుపదేశింప మిమ్ముఁ బ్రార్థించుచున్నాను."

అందుకు సలుంబ్రాకృష్ణసింహప్రభు విట్లు విన్నవించెను: "నా స్వామిభక్తి లోక మెఱిఁగియే యున్నది కదా! దేశహితము మానినచో భూమండలమెల్ల వచ్చు

వని చెప్పినను, నాయెడమకాలనైనఁ దాఁకను. నా రాజ్యము, నా సర్వస్వము నీయధీనము. నీ స్వాతంత్ర్య రథమునకు నా కుడిభుజ మిచ్చి మోసెదను. పదివేల యేనుఁగుల బలము గలవాఁడనై నీవైరుల నేలఁ గూల్చి నీకొఱకై నా ప్రాణములనైనఁ ద్యాగమొనరింపఁగలను. ఇది నా ప్రాణములమీఁద నాన!" కృష్ణసింహుఁ డనినపిదప భానుసింహ శ్యామసింహ మనస్సింహాదులు తమతమ యకుంఠిత దేశభక్తిని జాటి దేశరక్షణకై సర్వస్వ మర్పింపఁ బ్రతిజ్ఞలను దాల్చిరి.

గాంభీర్యము మూర్తిదాల్చినటులున్న ప్రతాపుఁడు వారి నిశ్చయములను విని, కనుదామరలనుండి మోదబాష్ప మకరందము లుబికి చెక్కుటద్దముల జాలువాఱుచుండ, "ఇందఱు త్యాగమూర్తులు, వీరవరేణ్యులు నాయండనుండ నాకేమి భయము? విజయము మనకు నిశ్చితము. మిన్నువిఱిగి మీఁదఁబడుచున్నను నడుగావల నిడఁబోము. నిష్కారణముగ రణము రేపి రత్నగర్భను రక్తగర్భ నొనరింపఁబోము. ఒక చీమకైన హానిగలిగిన నోర్వము. మన ప్రాణములకన్న మిన్నగ, దేశమందలి తరులతాగుల్మాదులఁ గాపాడుకొన వలయును. నా హృద్బంధువులను మిమ్ము రణవ్యాజమున యవనుల కత్తులకు బలిగావింప నొల్లను. మేవాడరాజ్యలక్ష్మి నుదుటి కుంకుమవంటి చిత్తూరును బీడుగావించిన యక్బరు నేఁడు హారావళీ పర్వతములసైత మాక్రమింప వేచి యున్నాఁడు. అతఁడు మనలోని వీరులకు రాజ్యమును, రాణులను లంచమొసఁగి వారిని దనప్రక్కకు మరలించుకొనఁ

జూచుచున్నాఁడు. కనుక మనకెల్లరకు నాత్మనిగ్రహ మావశ్యకము. ఇది మొదలుకొని నేను మొదలు పసిపిల్లవాని వఱకుఁ గల మన మందఱము వెండి బంగారు పాత్రలలో భుజించుట మాని బండలమీఁద దోసిళ్లలో భుజించుట నేర్చుకొన వలయును. పఱుపులను వీడి బండలపైఁ బండుకొందము. ఋషులవలె గడ్డములఁ బెంచుకొనెదము. అరనిదురతో, నర కడుపు తిండితో వీరవ్రతము నూనెదము. పరమేశ్వరుని సేవించుచు, సుఖముల విడనాడి మసలుదము. అరిషడ్వర్గముల గెల్చి సత్యశౌచదయాదుల ననుష్ఠింతము. జగము లెదురెత్తివచ్చినను స్వాతంత్ర్య పథమునుండి యడుగావల నిడఁ గూడదు. స్వాతంత్ర్యసేవకుల పథములు కంటకమయములే కాని పూలపానుపులు గావు.

"మన మెల్లరము తెల్లవారకముందే లేచి, యుదయపురము వదలి కుంభల్ మియరుకోట కరుగుదము. ఈ పదివేల పల్లెల ప్రజలెల్లరు తమతమ కాఁపురములతో నచ్చటి కరు దేరవలయును. ఈ నాఁడు మొద లెవ్వరేనియుఁ బొలముల దున్నరాదు. బాటలలో నడువఁగూడదు. బావినీరు త్రాగరాదు. అడవిమృగములఁగాని, మఱి యే ప్రాణినిగాని హింసింపరాదు. చెట్లను పుట్టలను బడఁగొట్టరాదు. కొండలు, లోయలు వదలి బాటలలో నడయాడఁదగదు. అంబరు దేశము మొదలు సలుంబ్రా రాజ్యమువఱకుఁ గల దేశము పాడుపడి పోవలయును. అక్బరెన్నఁడైన దండెత్తినచో నతని కిచట నేలమట్టి తప్ప నేదియు దొరకకుండవలయును. అక్బరు శాంతించి యూరకున్న, నందఱకు మేలగును. కాదుకూడదని యాతఁడు

వచ్చినచో తడిసి ముప్పందుము మోయించెదము. హరిశ్చంద్రుఁడు, మాంధాత మొదలగు రాజుల వంశమునం దుదయించిన నేనీ తుచ్ఛమానవులకు మోఁకరిలింపఁజాలను. నా యెత్తు ధనమిచ్చినను యవనులకొలు వొనరింపను. ఇన్నాళ్లు బ్రతికి పగవారికూటి కాసింపఁబోవను. కాన బలముచూపి పగవారిని చెండాడి గెలువనైన గెలిచెదము; లేదా రణదుర్గకు బలియౌద''మని పలుక నంద అంగీకరించిరి.

మఱునాఁటి యుదయమే పరివారముతోఁ, బ్రజలతో, సామంతులతో, బంధుమిత్రులతోఁ బ్రతాపుఁడు హారావళీ పర్వతారణ్యముల కరిగెను. లక్ష పెండ్లిండ్లు జరిగిన నున్నంత జన మచ్చటఁ జేరిరి. ప్రజలు లేనందునఁ బల్లెలు, పట్టణములు పాడుబడినవి. చీమలుదూఱని చిట్టడవులు, కాకులు దూఱని కాఱడవులతో దేశము నిండెను. ఒకమాఱు బదనూ అడవులలోఁ దిరుగుచున్న మ్లేచ్ఛులను బ్రతాపుఁ డేగి, చించి చెండాడి వచ్చెను. ఇంకొకమాఱు పదివేల సైన్యములతో షాహాబాజుఖాను చిత్తూరున కేగుచుండ నడవులలో నెదిరించి, బెదిరించి దయదలఁచి విడిచిపెట్టెను. ఎవరిని పొలముల దున్ననీయక, పశువుల మేపనీయక, మొకములఁ జంపనీయక, తరువులఁ బడఁగొట్టనీక, ప్రతాపుఁడు కృష్ణసింహునితోఁ గలసి, కనిపెట్టి చూచుచుండెను. రాణా యానతి లవలేశమైన దాఁటినవాఁడు హరిహరబ్రహ్మాదు లడ్డువచ్చినను బ్రతికి పోఁగలఁడా? భోగములను వీడి ప్రతాపుఁ డిచ్చట కష్టపడుచుండ, నచ్చట నక్బరు ప్రతాపు నోడించుట కెత్తులెత్తుచుండెను.

# 3. రాయబారము

ఢిల్లీ నగరమున నక్బ రొకనాఁడు తన బావమఱఁది మానసింహుని రహస్యాలోచనామందిరమునకుఁ బిలిపించి ముచ్చటలాడుచు నిట్లు నుడివెను: "మానసింహా! నాకుఁ బదమూఁడేండ్ల వయస్సు వచ్చినది మొదలు రాజ్యభారము నెత్తిపైఁ బడినది. దేవుని దయవలన సర్వమును జక్కఁజేసి దేశమును బాఁడిపంటలతో వర్ధిల్లఁజేసితిని. తెగిన హారము లోని ముత్యములవలె దేశమున రాజ్యములు బెక్కువ్రక్కలై, పాయలుపాయలై యున్నవి. ఆయా రాష్ట్రపతుల కంతఃకలహములతో రణములు చెలరేగుచున్నవి. నిత్యలక్ష్మీవిరాజితములు కావలసిన రాజ్యములు రణములతో శ్మశానములగుచున్నవి. ఈ చిన్న చిన్న రాష్ట్రములెల్ల పోయి యఖండ భారతఖండ మేర్పఱచుటకుఁ గొండంత యాశతో నున్నాను.

"నేను రాజ్యమునకు వచ్చినది మొదలీయూహ తోడనే యాగ్రా మొదలు దినదిన మొక్కొక్క రాజ్యము గెలుచుచుఁ బ్రభాతకాల పవనునివలె లోకుల యనురాగమును జూరగొంటిని. రామరాజ్యమని ప్రజలు కొనియాడునట్లు పాలించుచున్నాను. ఎవరో యేమూలనో యొకరిరువురు విషయము తెలిసికొనలేక నాకు రాజ్యతృష్ణ యున్నదని యనిన నందురుగాక! నిజము మీ రెఱుఁగరా, సామంతు లెఱుఁగరా, ప్రజలకుఁ దెలియదా? సహగమన దురాచారము మాన్పించితిని. అన్యాయపు పన్నులను దీసివేసితిని.

మద్యమాంసాదులను నిషేధించితిని. భారత రాజులతో వియ్య మొనరించుచుంటిని. హిందూ మహమ్మదీయ మత ముల రెండింటిని నా రెండు నేత్రములవలెఁ జూచుకొను చున్నాను. మీ హిందువులలో నా ప్రాణములకన్న మిన్న లగువార లెందఱు లేరు ? వారి కాల ముల్లుగ్రుచ్చుకొనినను గుండెలో గాయమైనట్లు నేను బాధపడుదును. భారతదేశ రాజకీయములఁ గూర్చి రేయింబవళ్లు కంటికిఁ గూర్కలేక తిండి రుచింపక బాధపడుచున్నాను.

"రారాజనై మితిలేని భోగముల ననుభవించుచున్నా నని నన్ను మీరనుకొనుచున్నారేమో ? నా హృదయమునకుఁ జింతయే మిగిలియున్నది. ఎవరితోఁ జెప్పుకొని యేమి ప్రయోజనము ! ఆర్చువారా తీర్చువారా యని నాలో నేనే మథనపడుచుంటిని. ఇరువదియేండ్లనుండి యీ విచారము నోర్చుకొన్నా నిఁక నోర్వఁజాలను. చిన్నప్పటినుండి కంటికి ఱెప్పవలె నన్ను బ్రోచుచున్న నీకంటె నాకు హితుఁడు కలఁడా ? నీకుఁ దప్ప నింకెవరికిఁ జెప్పుకొనఁగలను? భరత ఖండమంతయు నాకు హస్తగతమై యుండ మేవారు రాజ్య మొక్కటే స్వాతంత్ర్య దురభిమానపూరితమై నాయాజ్ఞను మీఱి, నా యధికారము నంగీకరింపక ధిక్కరించుచున్నది.

"ఆ ప్రతాపసింహుఁడు దుర్విదగ్ధుఁడు. నన్ను ప్రేమించి నాతో వియ్య మొనరించినందులకు మిమ్ముఁ బంక్తి బాహ్యులఁ జేసెనటగదా ! మీ ఘనతకు లోపము గల్గించి నాకు విషాదము రేకెత్తించినాఁడు. అతని దేశమున మనకు కా నేని యాదాయము గలదా ! ప్రజలను కొండలలో నుంచి

పల్లెలను, పట్టణములను పాడుబెట్టినాఁడు. ఎలుకలకు వెఱచి యిల్లు తగులఁబెట్టుకొనిన ప్రబుద్ధునివలె నున్నాఁడీ ప్రతాపుఁడు. తాను దేవాంశమునఁ బుట్టిన సూర్యవంశమువాఁడఁట. నేను కలికిమొలికి యవనుఁడనఁట. నలువురెవరో తనను పొగడినంతమాత్రమునఁ గన్నుమిన్ను తెలియక నాపైఁ గయ్యమునకుఁ గాలు దువ్వుచున్నాఁడు. మేము భయపడి దూరముగ నుండకున్న మర్యాద దక్కదఁట. మేము దండెత్తి వచ్చో మాయంతుఁ జూచునఁట. నన్నాశ్రయించిన రాజులేమైన చేఁదుమేసిరా? వారు సుఖించుటలేదా? తాననుభవించు సుఖము వారికి లేదా? ఎందు కాతనికీ మొండిపట్టుదల? నా యధికారము నంగీకరించినంత మాత్రమున నాతనికి వచ్చు నపకీర్తియేమి? నా కోరిక యొకటే. విశాల భారత దేశము నిర్మించుటయే నా పరమోద్దేశ్యము. ఒక దేశమున నిరువురు స్వతంత్రు లుండఁదగునా? అతఁడు వట్టి పెడసరికట్టె యనిపించుకొనుటకన్న మఱేమైనఁ గలదా? నేను రేఁగిన నెవ రాపఁగలరు? తానెంత, తన రాజ్యమెంత? నా ప్రాణబంధువులగు మీకుఁ గష్టము గలుగునని తలఁచి యూరకొంటినిగాని, నేను రేఁగిన నామరూపములు లేకుండ జేయనా! 'నీవాఁడ'నని యతని నొక్కమాఱు నాతో ననుమనుము. నీ యిష్టము వచ్చినన్ని సమ్మానములతనికిఁ దెల్పుము. అతఁడు స్వతంత్రుఁడగుట చూచి నేనోర్వలేక కాదు. దేశమున నిరువురి యేలుబడి తగదని పలుకుచున్నాను. ఈ చింతతో నా మనస్సు వికలమైనది. రాచపుండువలె నన్నిది పీల్చి పిప్పి చేయుచున్నది. ఇంతటి

వాఁడవు నీవు నాకండగ నుండియు నేనిట్లు కృశింపవలసిన దేనా ?'' అని పలికి యక్బరు దిగులు మొగముతో తలవంచుకొనియుండెను.

మానసింహుఁ డక్బరును జూచి, "మహారాజా! నీకేల యీ విచారము! ఇది నా భారమని తలఁపుము. నీ కోర్కె దీర్చి ప్రతాపుని నీకు సామంతునిగ నొనరించెదను. నీ వనెడి విషయమును జూచిన దోషము కనిపించుట లేదు. లోకము సుఖించు సిద్ధాంతమును జాటితివి. సమయము చూచికొని, యొకమాఱు ప్రతాపుని కడ కేగి నీ కార్యము జక్క చేసెదను.

''తరతరములనుండి మేవాడు రాణాలు మా కధిపులని, మేము వారిని సేవించుట సంప్రదాయమని మా పూర్వు లను చుందురు. అది యెప్పటి మాటయో నే నెఱుఁగను. అతనిని నా కనులతోఁ జూచియైన నెఱుఁగను. నే నన్నో సేనానినై సామంతుఁడనై వియ్యపువాఁడనై నీ కడ పూలసంకెలలు దాల్చి నీ దాసుఁడనై పడియున్నాను. ప్రతాపుని నీకుఁ గూర్తును. తొందరపడి దండెత్తకుము. శిరీషపుష్పము తుమ్మెద తాకిడి నోర్చుకొనలేదు; గరుడపక్షి ఱెక్కదెబ్బకు తాళఁ గలదా!'' యని పలుక నక్బ రంగీకరించెను.

కొన్నాళ్ళకు మానసింహుఁడు తన యంబరు దేశమునకు వచ్చుచుఁ ద్రోవలోఁ 'బ్రతాపునిఁ జూడఁదలఁచితి'నని మామను జయమల్లు నతనికడ కనుమతికొఱకుఁ బంపెను. ప్రతాపుఁ 'డుదయసాగర ప్రాంతమునఁ గలిసికొండ' మని

వార్త నంపెను. అనుకొనిన ట్లావేళకు మానసింహుఁ డుదయ
సాగరప్రాంతమునకు వచ్చెను.

ఎక్కడఁజూచినను బర్ణశాలలే! అన్ని యెడల దర్భా
సనములే! నిరాడంబరత యాప్రదేశమున నుట్టిపడుచుండెను.
ఆ చెంతనే పది దర్భాసనములు పఱచియుండిరి. ప్రతాపుఁ
డొక యాసనముపైఁ గూర్చుండియుండెను. మానసింహుఁడు
రూపుఁదాల్చిన మగతనమనునట్లు రాచఠీవితోనేగి హయము
డిగ్గి పర్ణశాలలోని కేగి, చేతులుమోడ్చి, నేలపై మోఁకాలూని
కూర్చుండి తలవంచి నమస్కరించెను. ప్రతాపుఁడు సాదర
చిత్తమున "అంబరుదేశాధీశా! రా రమ్ము. ఇచటఁ
గూర్చుండు"మని గౌరవించెను.

ప్రతా :—మానసింహా! ప్రాభవమున నీ వంటివాఁడు
లేఁడనిపించుకొంటివి. భారత దేశ రాజకీయములు నీ తలపైఁ
బడి విశ్రాంతి నీయకున్నవి గదా? ఈ వేసవిలో నీ మండు
టెండలో శ్రమకోర్చి యింత దూరము పయనించి నన్నుఁ
జూడవచ్చుటకుఁ గారణమేమిఁగఁ గోరుచున్నాను.

మాన :—మహాత్మా! ధర్మరక్షణకై బంధువులను,
బరివారమును, దేశమును వదలి సర్వస్వము స్వాతంత్ర్య
దేవతకర్పించి, యామె నుపాసించు నిన్ను సేవించుటకన్న
నాకుఁ గోరఁదగిన దింకొకటి గలదా? ఓ రాజర్షి! నిన్ను
సందర్శింపఁ దలంచితిని. ఇక్కడకు వచ్చి నా పుట్టువు సార్థక
మొనరించుకొంటిని. ఆహా! ఈ హారావళీ పర్వతములే
కోలువుకూటములు. వృక్షములే సితచ్ఛత్రములు. గండశిలలే
సింహాసనములు. పూలగుత్తులే చామరములు. మృగములే

సేవకులు. ప్రకృతిని బరిపాలించు నీ వీరవ్రతము నేనుని కొని యాడఁగలను ?

ప్రతా :—నాయనా! మానసింహా! ఇది సూర్య వంశీయులకుఁ గ్రొత్తగాదు. మా పూర్వులాచరించిన ధర్మ దీక్ష ననుసరించుచుంటిని. ఆపదలందు ధైర్యము కావలయును గదా! దృక్పథమున భేదమే కాని కష్టసుఖములు దైవదత్త ములు. కష్టమే యుత్కృష్టమైనది. అది తన నాశ్రయించిన వారి పాపముల మాపి శాంతమును, సర్వసమత్వము నొసఁగి వారి నుత్తమోత్తములను గావించును. నందనమువలె నానంద మొనరించు స్వాతంత్ర్య దేవత నేఁడాపదలలో మునిఁగి యున్నది. ఆమెను రక్త హస్తములతో నాత్మార్పణ మొన రించి యుద్ధరింపవలయునుగాని, రిక్తహస్తములతో శుష్క ప్రియములతోఁ బ్రయోజనము లభింపదు. ఎండ కన్నెఱుఁగక భోగములతోఁ బ్రొద్దులు పుచ్చువానికి జీవితపు వెలుఁగు బాటలు తెలియఁగలవా? నా కష్టములకై విచారింపకుము. నేను కష్టములకు జంకను.

మాన :—ఐన, నా మనవి యొకింత గలదు. అవధ రింప వేఁడుచున్నాను! కాబూలు మొదలు వంగదేశము వఱకుఁ గల రాజ్య మేకచ్ఛత్రముగఁ బాలించుచు నేఁబది లక్షల కాల్బలము, పదునైదులక్షల యాశ్వికదళము, నైదు వేల గజములు, ఫిరంగులు గల యక్బరుసాటివాఁడీ లోకము నందుఁ గలఁడా! అతఁడు పక్షపాతము వీడి, హిందూ మహమ్మదీయులను కన్నులవలెఁ జూచుకొనుచున్నాఁడు. ఆశ్రయించినవారి కోరికలను గాదనక లేదనక తీర్చుచున్నాఁడు.

అపజయ మను మాట జీవితమం దెఱుఁగని పరాక్రమశాలి! హిందూ దేవాలయములను గట్టించి పోషించెను. ఉద్యాన వనములఁ బెంచెను. బాటలప్రక్కన చెట్లను నాటించి, యచ్చటచ్చట బావులఁ ద్రవ్వించెను. అన్ని భాషలలోని కవుల నాదరించి కృతుల నంకితము గొనుచున్నాఁడు. తన యాజ్ఞ దలఁదాల్చినవారికి రాజ్యములిచ్చి నెయ్యము వియ్యమొసఁగి కల్పవృక్షమై రక్షించుచున్నాఁడు. బృందావనమున కేగి గోవిందునకు వజ్రకవచము నొసఁగినాఁడు. మహమ్మదీయ రాజు లెవరైన హిందూదేవతల నిట్లారాధించిరా! జుట్టుపన్ను తీసివేసెను. ప్రతిదినము గోవును బూజించి సూర్యనారాధింప నిదే యాహారముఁ గైకొనఁడు. మాంసము మానెను. ఈ సాత్త్వికగుణము లితరులకుఁ గలవా! అతఁడు స్వామి! నీవు గురుస్వామివి! అతఁడు రక్తి నొనగూర్చును. నీవు విరక్తి నొసఁగుదువు! మీ రిరువురును నాకు రెండు కన్నులు. మీ పాదములఁ దలఁదాల్చి కొల్తును. నీ ధర్మదీక్ష లోకవంద్యమే కాని, యొక్కమాట. దేశకాల పాత్రముల గమనింపవలసి యున్నది. రాజనీతి సకలార్థముల సాధింపఁగలదు. వ్యర్థముగఁ గష్టనష్టము లొనగూర్చు మూఢాచారములఁ బరిహరింపవలసి యున్నది. చూచితివా? నీ వీరధర్మము నెపమున దేశము బాడుపడియున్నది. పంటలతోఁ బచ్చగనున్న పొలములు బాడైనవి. జనులు తిండికి లేక, నిలువ నీడలేక మాడిపోవు చున్నారు. వీరులు శుష్కకంకాళములైనారు. భాగ్యదేవతల వంటి తల్లులు దరిద్రదేవత లైనారు. ఒకపూఁట తిండితిని బండలపైఁ బవ్వళించు నిన్ను చూచుచుండ నా కన్నులలో

నీరు తిరుగుచున్నది. ప్రపంచోన్నతుఁడవు కాఁదగిన నీవు స్వల్పుఁడవు కాఁదగునా? నీకు మ్రొక్కి విన్నవించు నా విన్నపము వినుము. అక్బరు ప్రబలశత్రువు. అతనితో విరోధము తగదు. పాలు నీరువలె మీరుకలిసియున్నచోఁ దగును కాని కాదు గూడదని మీరు పోరాడఁదొడఁగుట యకాల ప్రళయము కాదా! నీవా, వైరాగ్య సముద్రుఁడైన శంకరునివంటివాఁడవు. అతఁడు భోగభాగ్యములతోఁ దులదూగు నారాయణుఁడు. సిరులఁ దులదూగు మనదేశ మీ దారుణ రణములవలన నశించుట లేదా!

ప్రతాపుఁడు :—మానసింహా! నా మనస్సునకు నీ హితోక్తులు సంతసము గల్గించినవి. ప్రపంచమున జన్మించిన ప్రతి మనుజునకును స్వాతంత్ర్యము జన్మబాధ్యత. దానినిఁ గాపాడుకొనుట ప్రతినరునకుఁ గర్తవ్యము. ఒకని కొకఁడు లోఁబడియుండుట దైవసమ్మతము గాదు. సంపదకాసించిన పందలెవరో సాటివానికి లొంగి యుందురుగాని, యుండఁబుఁ శారతంత్ర్య మోర్చుకొని యుండఁగలరా? స్వేచ్ఛకై పోరాడు వారిపక్షమున లేకున్న దైవమెందుండును? రాజనీతి, ధర్మ మార్గములలో రాజనీతియే లాభము నొసఁగఁ గలదు. కాని తుచ్ఛమైన యైశ్వర్యమునే యది యీయఁగలదు. కాని ధర్మము లోకములకు రక్ష. పౌరుషము విడనాడి యక్బరున కెట్లు లొంగమందువు? పలువురు నీవంటి వా రక్బరును మంచి వాఁడనియే పలుకుచున్నారు. అతనిని దుష్టుఁడని నేననినానా? నాకు సైతమాతనిపై గౌరవము గలదు. అతఁ డమానుష

గుణవంతుఁడు కాకపోయినను, యవనులలో నుత్తముఁడు కావచ్చును. నీ వనిన ట్లతని కెక్కువ బలముండిన నుండ వచ్చును. అతనిలో సైతము పరిశీలించినచో లోపములుండక పోవు. తనచేత నోడిపోయినరాజులు పగసాధింపకుండ నుండు టకై చుట్టరికము గల్పించినాఁడు. అతని మనస్సు గూఢము. బంధుత్వము పేరితో హైందవులను లోఁగఁ దీసికొనినాఁడు. తన కెదు రుండ రాదను దీక్షతోనే కదా, దుర్గావతితోఁ బోరాడినది? ఆమె యాఁడుదయ్యును వెనుదీయక పోరి వీర మరణ మొందియుండ, మనము పందలమై యతనితో సంధిఁ గావింపవలయునా? ఘూర్జర దేశము క్షామమున మాడిపోవు చుండ, తాను వంగదేశమున నెఱుఁగని వానివలె నుండెనే కాని, యాదేశము కష్టముల కాదుకొనెనా? పది పండ్రెం డేండ్ల నాఁడు సన్యాసులకు వారిలో వారికిఁ దగవులు పెట్టి వారి నక్బరు తుదముట్టించ లేదా? లోకమున దుర్గములను బట్టి, బలమును బట్టి గొప్పదనము రాఁగలదా? ధర్మా చరణము గల పూజ్యుల గొప్పతన మెవరికి లభించును? "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యను నానుడి వినలేదా? బానిసతనమున వచ్చిన మేరువైన నాకుఁ బని లేదు. స్వతంత్రుఁడనై త్రాగు గంజియే నాకుఁ బాయసము. అక్బరుతో సంధించు నవసరము నాకేమి వచ్చినది? మే మిరు పురము దూరముగా నుండుటయే మేలు. పట్టణనివాసము నాకు రుచింపదు. ఆ మోఁకాలి మ్రొక్కులు, ఆ దొంగనవ్వులు, ఆ విమపుఁజూపులు నాకు గిట్టవు. నేను పొగడ్తల కాసింపను; రాజ్యములఁ గోరను, ఈ పర్ణశాలలు, తృణశయ్యలే నాకు

సుధర్మాస్థానములు, వైజయంతీ భవనములు. ఇవియే నాకుఁ దృప్తి నొసఁగునవి.

మాన :—మహారాజా! నీ వెఱుఁగని ధర్మములు గలవా? అక్బరు మేవాడను గబళింపఁ బొంచియున్నాఁడు. ఎప్పు డేవేళ నెట్లు విజృంభించునో, యెవ్వ రెఱుఁగఁ గలరు? బలవద్విరోధ మేల? ఇతర రాజుల కున్న నియమము లేవియు లేకుండ నీకు సంధిఁ గుదిర్చెదను. నీ కన్యలను పాదుషాకీయకుండ, నీ రాణివాసము నవరాత్ర్యుత్సవములకు ఢిల్లీకి రాఁ బని లేకుండ, సైన్యాధిపత్యము పూనుకొకుండ, మోఁకాలి మ్రొక్కులు లేకుండ సంధి గూర్తును. నీ కవమానమైన నాకుఁ గాదా? నీవు 'ఊఁ' యనిన చాలును. నిమిషములోఁ బోయి కనుచీఁకటి వేళ కక్బరు నిచటికిఁ గొనివత్తును. నీ వుదయపుర మేలుకొనుము. కాదనిన చిత్తూరునుగూడఁ గైకొనుము. చిత్తూరును బాగుపఱచుటకుఁ బదిలక్షలవరహాలు గొనివత్తునా? కావలెనన్న మాళవ, ఘూర్జర దేశములఁ గూడఁ గైకొనుము. నీవు నాకు గురుస్థానము. నీ పాదరజము దలఁదాల్చి నే నన్నిటిని సమకూర్చెదను. ఈ పరిస్థితులలో సంధియో, సమరమో తప్ప గత్యంతరము లేదు. పూలతోఁట వంటి భరతఖండమును బీడు చేయవలదు. అక్బరు మహాప్రవాహమువలె ముంచుకొనివచ్చుచున్నాఁడు. అతని నెదిరింప నెవరితరము? పౌరుషమున్నదని బడబానలమును మ్రింగఁబోవుదురా?

ప్రతా :—(ముసిముసినవ్వులు నవ్వుచు) నీ హితోపదేశము ముగిసినదా? నీ మాటలను వినుచుండ నా కడవి

చిలుక-పంజరము చిలుక కథ గుర్తునకు వచ్చినది. వేయేండ్ల నుండి దేశము పరపరిపాలనము వలన బీడైపోయినది. మానసింహా! అభిమానసింహుఁడవు నీ విట్లాడఁదగునా? మా వంశమునకు దుర్యశముఁ గూర్పఁదలఁచిన నీచుని తల వేయి వ్రక్కలు గాక నిలువఁగలదా? మా వంశీయు లెన్నఁడైనఁ బారతంత్ర్యము నొందిరా? అక్బరును దేశమేలువానిగ, మన మాతనికి లొంగవలసినదిగ, భగవంతుఁడు సృజించెనా? రాజాధిరాజుల కూఁతు లాతని కుంపుడుకత్తెలు గాక తప్పదా? స్త్రీల పాతివ్రత్యము, పురుషుల పౌరుషము దేశమునకు శ్రీరామరక్ష! ఎన్ని వేల సంవత్సరము లెన్నిసన్నాహములతో నక్బరు పోరినను, మా దేశ మాతనికి లొంగదు. నా కాతఁ డించుకేని యవమానము తలఁచినను, ప్రళయమే కలిగింతును. పగవారి కుత్తుకలు చీల్చి చెండాడెదను. పుడిసెఁడూపిరియున్నంతవఱకు స్వాతంత్ర్యపథమున నే నడతును. మిన్నువిఱిగి మీఁదఁబడినను సైరింతును. నా శక్తికి మించి నపుడే యక్బరు నాశ్రయింతును లెమ్ము. అంతవఱకు నే నెవ్వరిసాయము గోరను.

కృష్ణసింహుఁడు :—(మానసింహునిఁ జూచి) ఓయీ! పిచ్చి మానసింహా! దేశము దాస్యాంధకారమున మునిఁగి, దుర్గతులొందు వేళలో దేశరక్షణమునకుఁ బూనుకొనక, మొగలుల సేవించుచు, సిగ్గువిడిచి యీ ధర్మదేవతకు పిఱికి మందు నూఱిపోసెదవా? పాపము! చట్టములు మార్చెదవా? చీఁకటిలో నక్బరును గొనివచ్చి సంధి కూర్తువా? ఎవరికో లంకయ్యా యీ పాట్లు! ఎందుకీ కల్లబొల్లి కపటనాటకములు?

పరమేశ్వరుఁడు మన చిత్తవృత్తులఁ బరిశీలించుచుండుట లేదా? ప్రతాపుఁ డేడ, చాటుమాటున సంధిగోరు టేడ? యవనుల పదము లాశ్రయించి కుశరాజుకీర్తుల మంటఁబెట్టినది చాలక, ప్రతాపుని లొంగఁదీసికొని లవరాజు కీర్తుల సైతము నశింపఁ జేయుదువా? తాఁ జెడిన కోఁతి వనమెల్లఁ జెఱచుట యిట్టిదే కదా! పాముకన్న తేలు మేలన్నట్లు నీకన్న నక్బరే వేయిరెట్లు మంచివాఁడు. అతఁడు తన కులమును బాగుపఱచుకొనుచున్నాఁడు. నీవు నీ కులమును నేలఁ గలుపుచున్నావు.

ప్రతాపునితోఁ బదివేల యక్బరులైన సాటివత్తురా? ఈ భూమండలమెల్ల నేలినను, నీతఁ డన్యాయపథమున నడుగు మోపునా? అట్టివానిని నీవు మఱలింపఁగలవా? ఈతఁ డొంటరివాఁ డనుకొంటివేమో? ఇరువదిరెండు వేల స్వాతంత్ర్య యోధు లీతనికి బాసటగా నున్నారు. యవనసేనాసముద్రమునఁ గులపర్వతమువలె నిలబడును. అక్బరు బలవంతుఁడనియే కదా నీ భయము? ఈశ్వరకటాక్షమున్నచో గడ్డిపోచ మేరు వగుచున్నది. తలబలిసిన పర్వతమైనను భూకంపమున నేల వ్రాలుచున్నది. ఈ ప్రతాప ప్రభంజనుఁడు విక్రమించిన నీవు, నీ యక్బరు ఎందు నిలువఁగలరు? (అని పలికి, ప్రతాపునిఁ జూచి) దేవా! భూదేవికి భగవంతుఁడు పూలనగ లిచ్చుచుండువఱకు, జగత్ప్రాణుఁడు జగత్ప్రాణుఁడగునంతవఱకు, సత్యము శాశ్వతముగా నిలుచునంతవఱకు, లోకమున స్వాతంత్ర్య మాహాత్మ్యము నిలుచునంతవఱకు నీ గుణములు, నీ కీర్తిప్రతాపములు మనఁగలవు.

ఇంతలో నొక సేనాని వచ్చి భోజనమునకు వేళయైన దని ప్రతాపునకు విన్నవించెను. అందఱు లేచి లోని కరిగిరి. క్షణములోఁ బది వేల ఆకులు సిద్ధపఱచిరి. ప్రత్యేక మర్యాదలతో వెండి, బంగారు పాత్రలు కొన్ని యమరించి యాహారము వడ్డించిరి. మానసింహుఁడు, నతని పరివారము గూర్చుండిరి. అప్పుడు ప్రతాపుని పెద్దకొడు కమరసింహుఁడు వచ్చి మానసింహునితో "వేళయగుచున్నది. భోజనమునకు ఆరంభింపుఁ" డనెను.

మాన :—లోకగురుఁ డేఁడీ? రా లేదా! ఆయన లేని దే యెట్లు భుజింతును!

అమర :—మా తండ్రి కారోగ్యము చక్కఁగా లేదు. మీ యుపచారమునకు నన్నుఁ బంపినాఁడు.

మాన :—ఔరా! అతిథినగు నన్ను, మీ యయ్య వచ్చి బంతి గుడువక, యవమానింపఁ దలఁచెను. ఆయన రాని దే నే నన్నము ముట్టను. నీ వేగి మీ తండ్రిని పంపించుము.

ఇంతలోఁ బ్రతాపుఁ డరు దెంచి, "మానసింహా! నా నియమ మెఱుఁగవా? యవనులతో వియ్యమందినవారి బంతిలో భుజింపననుట నీకుఁ గ్రొత్తగా నున్నదా? పంక్తి భోజనముదప్ప మఱి దేనిని నీవు కోరినను సమకూర్తును. కూడు కూరలు చల్లవారుచున్నవి. వేగ భుజింపుము." అనెను.

మాన :—(మండిపడి) ఏమయ్యా! అతిథిని నన్నవమానింతువా? నీ పెద్దరికమును వృద్ధిచేయుటకే యవమాల చుట్టరికము బట్టితిని. ఈ నాఁడు నే నక్బరు నాశ

యుండక పోయినచో, నీపాటికి నీ వేమై యుండెడివాఁడవో! సముద్ర తరంగములకన్న మిన్నలగు సేనాతరంగములు నిన్నుఁ బాతాళమునకు ముంచివేయక పోవునా? నిన్ను సేవింపవచ్చిన నన్నుఁ బంక్తి బాహ్యునిఁ గావించితివా? నీ మెడపైన తల నిలుచునా? ఈ నాఁటితో నీకు, నాకుఁ గల స్వామిభృత్యభావము తీఱిపోయినది. నిన్ను నిలువ నీడలేక చేసి ముప్పుఁ ద్రిప్పలఁబెట్టి మూఁడు చెఱువుల నీరు ద్రాగింపనిచో నేను మానసింహుఁడను గాను.

ప్రతా :—(చుఱచుఱ చూచుచు) ఈ నిష్ఠురోక్తులతోఁ బ్రయోజన మేమైనఁగలదా? నిన్నుఁ బసుపు కుంకుమ బెట్టి నేను పిలిచితినా? నియంత నీవే వచ్చి భాషింపఁదలఁచిన మన్నించి మాటాడితిని. నా నియమము నీకొఱకై మాను కొనుమందువా? చేయఁదగిన మర్యాదలు చేసితిని. నీ వీరిడి పలుకులకుఁ గోపింపనేల? రణరంగమునఁ జేయి చేయిగలిపి బలాబలములు చూచుకొందము లెమ్ము.

మాన :—(రోఁజుచు) నీవు బ్రతికినన్నాళ్లు నా పేరు జపింపఁ జేసెదను. నిద్రాహారములు సైతము లభింపనీయను. నిన్ను సాధించి తీఱెదను.

అని పలికి చేతులు కడుగుకొని, తన పరివారముతోఁ బోయి గుఱ్ఱము నెక్కెను.

కృష్ణ :—(నవ్వుచు) ఏమోయి! రేపు నీతోఁబాటు ఢిల్లీపురమున మసలుచున్న నీ బావను, అక్బరును గొని తెత్తువా? నీ మేనల్లుని సలీమును గైకొనివత్తువా?

అని పలుక నందఱు చప్పటులుగొట్టి పకపక నవ్విరి.

మాన :—(మండిపడి) శివునికడ బసవెద్దువలెనున్న నీవుగూడ నన్ననవలయునా? నీగతి చూచుకొనెదము.

అని ఈర్ష్యారోషములు పెనఁగొనఁ బలికి పోయెను.

## 4. రణరంగము

అది గ్రీష్మర్తువు. సెలయేఱులు లడుగంటినవి. కూపములు కాసారములు ప్రీలి, నడుమ నడుమ బీటలువారిన నేల, పాతాళములోఁతును జాటుచుండెను. మండు టెండలకు లోకము వ్యాకుల మొందసాగెను. మానసింహుఁడు తన రాయబారము విఫలమగుటకు, దాను బొందిన యవమాన మునకు మండిపడుచు, ఢిల్లీ చేరి, పాదుషాతో మంతనము లాడి, దండయాత్రకు సన్నాహము లొనరించుకొని, యుక్కు-తునుకలవంటి సేనానులతోఁ గూడి బయలు దేఱెను. పాదుషా యువరాజైన సలీమును మానసింహుని వెంటఁ బంపెను. సేనలు కతిపయ ప్రయాణములతో, హాల్దీఘాటు కనుమ చేరెను. రణభిక్ష నర్థించి వచ్చిన యతిథులను రాణా ప్రతాపుఁడు నిరుత్సాహ పఱుపలేదు. ఇరువది రెండు వేల మంది మెఱియలవంటి రాజపుత్రులతో నాలుగు లక్షల మొగలు సైన్యము నెదిరించి, గడగడ లాడించెను. తేజసింహుఁడు, భానుసింహుఁడు, శ్యామసింహుఁడు, మనస్సింహుఁడు, కృష్ణసింహుఁడు, భీమచాందు తమ తమ సైన్యములతో రాణా కండగనుండిరి.

ఉభయ బలము లెదిరించినవి. పోరు ఘోరమైనది. క్షణ కాలముననే కనుమయంతయు వికలాంగుల యార్త నాదములతో, నెత్తురు టేర్లతో, వీరుల సింహనాదములతో నిండియుండెను. యవనులు ఫిరంగులను, తుపాకులను ప్రయోగించుచున్నను రాజపుత్రులు జంకక మడమ పెనుత్రిప్పక పోరాడఁ దొడఁగిరి. ప్రతాపుఁడు తన నెదిరించినవారినెల్లఁ జీల్చి చెండుచు రణరంగమున వీరవిహార మొనరించుచుండెను. ప్రతాపుని శంఖారావములకు బెదరి మానసింహాదులు ప్రాణభీతితోఁ బరువెత్తుచుండిరి. భానుసింహుఁడు వీరవిహార మొనరించుచుండఁ, బలువురు మొగలు సేనానులతనిఁ జుట్టుముట్టియును, బోరాడ లేకుండ, రణధర్మము విస్మరించి, మొగలు నాయకుఁ డొకఁడు వెనుకపాటున వచ్చి యాతనిని వధించెను. పదాతేంద్ర వీరుని ఖండేరావును న్యాయయుద్ధమున గెలువలేక వెనుకనుండి యవన సేనానాయకుఁడంత మొందించెను. రాజపుత్రస్థాన మహాకవి చంద్రభట్టును దొంగపోటున పొడిచిరి. తేజసింహు నెదిరింపలేక పలాయనము చిత్తగించు మొగలు సేనలను మరలింపలేక దడదడలాడి మానసింహుఁడు వెనుక మాటునుండి తుపాకి ప్రేల్చి కూల్చెను.

అపరాహ్ణము దాఁటిపోయినది. రాణా ప్రతాపసింహున కొక కోరిక గలదు. మానసింహునితోఁ బోరాడుటకై యాతఁడువ్విళ్లూరుచుండెను. ప్రతాపుని విక్రమ మెఱిఁగిన మానసింహుఁ డావిషయమున జాగరూకుఁడై యుండెను.

రాణా యెంత యత్నించినను మానసింహుఁడు తప్పుకొని పోవుచుండెను.

నడగొండవలె నున్న పంచమంగళి మను పట్టపేనుఁగు నెక్కి వచ్చుచున్న మానసింహ సలీములఁ జూచి, ప్రతాపుఁడు సంజ కెంజాయను దీటు కన్నుగవతో, చైతకమును కవ్వించు సింగమువలె చైతక మెగిరి గజమును బొదివి ముందర కాళ్లతో నేనుఁగు దంతముల ద్రొక్కి పట్టి హేషారవము లాచరింప పంచమంగళిము బెదిరి తొండముతోఁ దల విసరు కొనుచుఁ బాఱిపోవ మానసింహ సలీములు పునర్జన్మమెత్తిరి. మావటులు ప్రతాపుని కత్తి కెఱయైరి. కనులున్న భాగ్యము నకుఁ బ్రతాపుని పౌరుషముం గంటిమని యుభయసేన లగ్గించిరి. అక్బరు ప్రధాన మంత్రియగు నబ్దుర్ రహిమానును నిలువెల్ల రిచ్చవడి చూచి, "పదునాల్గు లోకముల వెదకినను రాజపుత్రులవంటి పౌరుషశాలురు, నీతిమంతులు ఉన్నారా? పాఱిపోవు యువరాజ మానసింహుల నఱుకఁదలఁచినచోఁ బ్రతాపుని కెవ్వరడ్డురాఁగలరు? ఇట్టి రణధర్మ విశారదులను పూజ్యులను హింసించు జాతికి మోక్షము గలదా? గొంతులో నూపిరి యుండువఱకు వీరి పాదసేవచేసి బ్రతికెద" నని నిశ్చయించుకొని చేతి కత్తి పాఱవైచెను.

ప్రతాపుని చేతిలోని సూర్యధ్వజము చూచి యితఁడే రాణాయని తలఁచి యవనులెల్ల రావంకకు మూఁగిరి. నానా విధాయుధముల విసరఁదొడఁగిరి. ప్రతాపుఁ డొకఁడయ్యును వెనుక దగ్గక, కేతనము వీడక పోరుచుండెను. ఆశంకుల సమరమున వైరి మిత్రభేద మెఱుఁగరాకుండెను. రాజపుత్రులు

బలియైపోయిరి. మేవాడభానుఁడు సందిగ్ధదశలోనుండెను. ఘుం దేహములతోఁ బోరుచు రక్తధారలఁ దొప్పఁదోఁగు భాస్కరునిరీతిఁ బ్రతాపుఁడు రక్తసిక్తాంగుఁడై ప్రాణములకుఁ దెగించి పోరుచుండెను. తమతేని నెత్తురు కంటఁబడఁగనే రాజపుత్రులు వీరవిహార మొనరింపఁ దొడఁగిరి. మనస్సింహుఁడు ప్రతాపునిఁ జేరి నమస్కరించి, యాతని చేతిలోని సూర్యధ్వజమును గొని దూరమున కరిగెను. రవిధ్వజ మున్నచోటఁ బ్రతాపుఁ డుండునని తలఁచి సేనలెల్ల నా వంక కరిగిరి. మనస్సింహుఁడు తన తొమ్మిదిమంది తమ్ములతోఁగూడ యవనులతోఁ బోరిపోరి దేశమాతఋణమును దీర్చి వీరస్వర్గమలంకరించెను. ప్రతాపుఁడు మానసింహుని పాటు విని భయంకరముగఁ బోరుచుండెను. ఆయన మేను మూఁడుచోట్ల బల్లెపుపోట్లు, నొక తుపాకిగుండు దూరిన గాయము, మూఁడుచోట్ల కత్తుల గాయములతో విరియఁబూచిన కింశుకమువలె నుండెను. తూములనుండి నీరు వచ్చినట్లు గాయములనుండి నెత్తురు కాఱుచుండ సింగముఁబోలిన చైతకముపైనుండి ప్రతాపుఁ డరివీరుల నఱకుచుండెను.

కృష్ణసింహుఁడు, భీమచాందు వచ్చి ప్రార్థించి బ్రతిమలాడి చైతకమును శత్రుల మధ్యమునుండి యీవలకుఁ గొనివచ్చిరి. తన వంశస్థుల కష్టములఁ జూడలేక సూర్యుఁ డస్తమించుచుండెను. ఆనాఁటి యుద్ధమునఁ బ్రతాపుని సైన్యము పదియాఱువేలు కూలెను. యవనబలము మూఁడులక్షలపైనఁ జచ్చెను. ఉన్నవారలలోఁగూడ గాయములు తగలనివారు లేరు. మొగలు సేనలు దిక్కులు జూడఁజొచ్చెను.

కృష్ణ :—దేవా! ఎల్లప్పుడు చిఱునవ్వులొలుకు నీ మోము విన్నదన మందనేల? ఏకలింగేశ్వరుఁ డిచ్చిన దానితోఁ దృప్తిపడవలయును. కాలము తప్పివచ్చిన నెంత వారలైన నేమిచేయఁగలరు? సాధనములు చాలనందువలన వెనుకఁబడితిమి. ఇంతమాత్రమున కేల విచారము? ఈపూఁట కిఁకఁ జాలును. రేపు మఱలవచ్చి, శత్రులగెల్చి విజయము గొందము.

ప్రతా:—తండ్రీ! ఇందఱు బంధువులను బోఁగొట్టు కొని యెట్లు వెనుదిరిగిపోఁగలను? నాకు శ్రమయేమియు లేదు. కత్తుకలో నూపిరియున్నంతవఱకు నిల్చి పోరాడెదను గాని వెనుదిరుగను.

భీమ :—దేవా! నీవు పోరలేవని కాదు. నీ బలపరాక్రమము లెఱుఁగక పలుకుటగాదు. ఇది పోరుట కదనుగాదు. మనము పోదము రమ్ము.

అని వా రిరువురు మెల్ల మెల్ల బలికి రానను చున్న ప్రతాపు నొడఁబఱచి రణభూమినుండి సాగనంపి తామును, తమ సైన్యములతో, నితర సేనానులతో విడిది కరిగిరి.

## 5. అష్టకష్టములు

జాముప్రొద్దు వేళకు సేనానులు భీమచాందు, కృష్ణ సింహుఁడు వచ్చి కూర్చుండిరి. ప్రతాపుఁడు వారి నందఱిని జూచి "మిత్రులారా! మన యీ నాలుగేండ్ల యత్నము వ్యర్థమైనదా? దేవుఁడు మనయెడ వికటించినాఁడు. నిన్న

నీ వేళకు నా సేనలతో నిండిన కనుమ నేఁటి కెట్లు శూన్యమై బోసిపోయినదో చూడుఁడు. పెండ్లికొడుకులవంటి సేనాను లెందఱో మరణించిరి. అమృతభాండము పగిలినట్లు పెండ్లి చవికె కూలినట్లున్నది. మేవాడ లక్ష్మిని సేవించిన రామ చంద్రరాజు నాకై ప్రాణముల విడచెను! జన్మజన్మముల కైన నతని ఋణముఁ దీర్చుకొనఁగలనా? పదునాలుగేండ్ల బాలుఁడయ్యు పౌరుషము నెఱపిన ఖండేరావు, పదునేడేండ్ల వాఁడయ్యు వైరుల గడగడలాడించిన తేజసింహుఁడు నశించిరే! భానుసింహుఁడు రణదుర్గ కాహుతి యయ్యెను గదా!" యనుచుండఁ జెంతనున్నవారు ప్రతాపునకు భాను సింహుని సేమము తెల్పిన నతఁడు సంతసించి భగవంతునిఁ బ్రార్థించెను.

"నిన్న మనస్సింహుఁడు, నతని సోదరు లొనరించిన త్యాగము మీ రెఱుఁగనిది కాదు కదా! నేఁడు మొదల తని స్నేహితుఁడగు దుర్గసింహునకు, నా కుడిప్రక్కను నిలిచి యుద్ధములో పోరు నధికార మొసఁగితిని. వారు తరతరముల వఱకు మహారాజబిరుదము వాడుకొనవచ్చును. వారు రాజ ప్రాసాదమున కరుదెంచినపుడు మొగసాలకు వచ్చువఱకు దుందుభులు మ్రోఁగుచుండవలయును" అని పలుక నందఱును సంతసించిరి. ప్రతాపుఁ డందఱిని బొగడి గౌరవించెను.

అంతఁ బ్రతాపుఁడు వారలఁజూచి "యనుచరులారా! పట్టినపట్టు వీడక, దేహమున్నన్నాళ్లు పోరాడెదము. నిన్నటి యుద్ధము రణరంగ నాటకమునకుఁ బ్రస్తావనమాత్రమే. ఎన్ని యంకములున్నవో! ఎన్నాళ్ళుండవలెనో! ఎన్నఁడు భరత

వాక్యము వినిపించునో! అంతయు నేకలింగేశ్వరుని దయ. మనము మాత్ర మింక నుత్సాహములకు, కష్టములకు సహింపఁ గలిగి యుండవలయును.'' అనెను. ఆమాట లంద అంగీకరించి కొండలోయలలోనికిఁ బోయిరి. వానకాలము వచ్చెను. కారు మబ్బు లాకసమునఁ జెలరేగెను. మ్లేచ్ఛ దురాగతములకు సహింపక ప్రకృతిగర్జించినదో యన నుఱుములు వినఁబడెను. భరతమాత కన్నీళ్లవలె వాన కుఱియసాగెను. యవనులదండు కొండలలోఁ దిరుగలేక రాజధాని కరిగెను. ప్రతాపుని కొకింత విశ్రాంతి చిక్కెను. ప్రకృతిమాతకుఁ జలి గిలిగింతలు పెట్టెను.

కానలలో, కోనలలో నడచి నడచి, షాబాజుఖాను హారావళీ పర్వతములు చేరుకొనెను. ప్రతాపు ననుచరులెల్లరుఁ దమతమ సేనలతో వచ్చి కలసికొనిరి. ప్రతాపుఁడు సేనలతో షాబాజు నెదిరించెను. పోరు ఘోరముగా సాఁగుచుండెను. నాఁటి యుద్ధమున నుభయపక్షములందును బెక్కండ్రు సమసిరి. యవనసేనావాహినులు రాజపుత్రద్వీపముల ముంచివైచెను.

ఆ మరుసటి సంవత్సరమే అక్బరు తాము గెల్చిన కోటలకు స్వయముగావచ్చి చూచి, తన ప్రతినిధులను నియమించిపోయెను. బహిరంగ యుద్ధములతోఁ బ్రయోజనము లేదని యెఱిఁగి, ప్రతాపుఁడు కైలవారాకొండలు దాఁటి కుంభల్మియరు కోటలోని కరిగి విశ్రమించెను. పుట్టలు పగిలి చీమలు గుట్టలుగుట్టలుగా వచ్చినట్లు యవనసైనికులు వచ్చి, కోటను ముట్టడించి, ఫిరంగులను గాల్పఁ దొడంగిరి. ప్రతాపుఁడు విజృంభించి పోరుచుండెను. కోటబురుజులనుండి,

కోటకొమ్మలనుండి భిల్లులు ప్రాగిన చమురు వర్షించుచు, బండఱాలను దొరలించుచుండిరి. గంటకు గంటకు యవనసేన పలుచనగుచుండెను. షాబాజుఖాను ఱాతిగుండెలలో భీతి పుట్టి యేమిచేయుటకుఁ దోఁచక, దేవరాధిపతిని ధన కనక వస్తు వాహనాదులతో దర్శించి, సాయమొనరింప వేఁడుకొనెను. ఆ నరరూపరాక్షసుఁ డర్ధరాత్రివేళ, కోటలోనున్న బావిలో విషముగలిపి వచ్చెను. తెల్లవారి నీరుత్రావి, యెక్కుడిసైనికు లక్కడనే మరణించిరి. దీని నెఱిఁగిన భీమసింహుఁడు ప్రతాపుని దరిచేరి "దేవా! దేవరాధిపతి బావిలో విషముగలిపి, తడిగుడ్డలతో గొంతుకోసినాఁడు. నెలలకొలఁది మొగలులతోఁ బోరినను మన కింత నష్టమురాలేదు. ఇక్కడ నింక నాలసించినచో, నిష్కారణముగా సంఘమృతి నొందుదుము. మీ రిప్పుడే కృష్ణసింహాదులతో రహస్యద్వారమున దుర్గమును దాఁటిపొండు. కోటను వైరులకుఁ జిక్కనీయకుండ సేనతో, నూపిరియున్నంతవఱకుఁ బోరాడెద" నని ప్రార్థింప, ప్రతాపుఁ డనుచరులతో నాలోచించి యా దుర్గమును వదలిపోయెను. మునుపటివలెఁ గోటలోనుండి పోరిన, నీటికి మొగము వాచి వేరొకబావి లేనందువలన విషపునీరు త్రాగి చావవలసియుండు నని తలఁచి భానుసింహుఁడు సూర్యద్వారము తెఱపించి శత్రువులఁ దాఁకెను.

చిచ్చర పిడుగులవలె సిద్ధహస్తులగు సైనికులతో చంద్రభట్టు భానుసింహునకుఁ దోడై నడచెను. రాజపుత్రులు పగతుఱఁ జీల్చి చెండాడుచుండిరి. యవనులు తఱిగి పోవుచుండ సూర్యుఁ డస్తమించుచుండెను. ఇంతలో నాసఫుఖాను

క్రొత్తసేనలతో నచటికరుదేర, యవనసేన లుప్పొంగెను. యముని నాలుకఁబోలిన కత్తితో భానుసింహుఁడుపోరుచు మొగలుసైన్యమును బ్రచ్చి లోనఁజొచ్చి పగతుఱ శిరములు దఱిగి మరణించెను. కవిరాజు దినరాజువోలె విజృంభించి యుగ్రతేజముతోఁ బొంగి మందేహులనుబోలు యవనులకుఁ జిక్కి గాయపడి హల్దీఘాటు రణమున మహమ్మదీయులను, దోమలవలె కసిమసగినాఁడను నజరామరఖ్యాతి నార్జించి మరణించెను. దుర్గము యవనుల వశమయ్యెను. మొగలు పతాకము విహరింపఁ దొడఁగెను. మానసింహుఁడు కొన్ని దుర్గము లాక్రమించి, ప్రతినిధుల నందందుంచి, ఢిల్లీకరు దెంచెను. మహబత్ఖా నుదయపురదుర్గము నాక్రమించెను.

ప్రతాపసింహుఁడన నీశ్వరుఁడా! విష్ణువా! మానవ మాత్రుని గెలువ మీరేల కొంకుకులాడెదరు? నా సైన్యములతో ప్రతాపుని గెలిచి, ప్రాణములతోఁ బట్టుకొని వచ్చెద నని ఫరీదుఖాను ప్రతిజ్ఞగావించి, తన సైన్యములఁ గొండల నిండ నుండఁజేసెను. ఒకనాఁడు రాణాగారు దుర్గబహిఃప్రదేశ మునఁ దిరుగుచుండ తెలిసికొని, ఫరీదుఖానుఁడు సేనలతో నేగెను. తనసేన నలుభాగములు కావించి యనుమానమున్న చోట్లెల్ల నాక్రమింప నాజ్ఞాపించెను. వేగు జామునకుఁ దప్పక రాణా చిక్కునని ఖాను మేనుమఱచి నిద్రించుచుండెను. అర్ధ రాత్రమునఁ గొండపై వహ్నికనిపింప నది దావానలమని ఖాను తలఁచెను. రాజపుత్ర సేనలతో ప్రతాపుఁడు ముందు వైపుననుండి ఫరీదుసేనలఁ దాఁకెను. అంటరాని మంటవంటి కృష్ణసింహుఁడు వెనుక వైపునుండి ఖానుసేనలఁ దాఁకెను.

కాకులవలె వీరులు వికావికలై పోవుచుండ దయనువిడనాడి ప్రతాప కృష్ణసింహులు పగతురఁ జీల్చి చెండాడఁ దొడఁగిరి.

ఒకమారు పదునైదువేల భటులతో రాయసింహుఁ డుదయపురము చేరఁబోవుచు వ్యాఘ్రశైలము ప్రక్కనఁ బోవుచుండెను. భిల్లులు చెట్లనుండి, పుట్టలనుండి గుంపులుగఁగూడి, హఠాత్తుగ నెదిరింప పాయలు పాయలుగవిచ్చి, వికావికవడి, యవనసేన పాఱిపోయెను. నాటికాలమున బ్రహ్మపుత్రనుండి పంజాబువఱకు, కన్యాకుమారినుండి హిమాలయమువఱకు దేశము శాంతిపూరితమై యుండెను. మేవాడయొక్క లే రణమునకు తావై యుండెను.

మెల్లగ నబ్దుల్లాఖాను మండల గృహాదుర్గ మాక్రమించెను. మానసింహుఁడు మాత్స్యదుర్గ మాక్రమించెను. శ్రావణమేఘములు గగనము నాక్రమించి జడివానలు కురియసాగెను. సేనలు విశ్రాంతికొఱకు రాజధాని కరిగెను. మార్గశీర్ష మాసము వచ్చుటతో వానలు వెనుకఁబడుటఁజూచి యవనసేనలు విజృంభించుచుండఁ బ్రతాపుఁడు వెనుదీయక పోరాడుచుండెను. ఏటేట నెలనెల దినదినము నిమిషనిమిషము రణములగుటచే, దేహము కృశింపసాగెను. సేనాబలము నశింపసాగెను.

దుర్గములెల్లఁ బగవారి పాలాయెను. ద్రవ్యసంపత్తి శూన్యమాయెను. కరవులో నధికమాసమనినట్లు కుటుంబము వృద్ధికాఁదొడఁగెను. తలఁదాఁచుకొన ననువగు తావులు సైతము దొఱకుట కష్టమయ్యెను. నానాఁటికి వైరులసేనలు పెరుఁగసాగెను. చెట్టుపుట్టలఁ బ్రాపు జేసికొని, కడుపునిండించి

కొనుచుఁ బూటలు గడుపవలసివచ్చెను. గడియ గడియకు పగతు రరుదెంచుటవలన విడుదులు మార్చవలసి వచ్చుచుండెను. ఎంతకును ప్రతాపుఁడు లొంగనందున, నక్బరు హారావళీపర్వతారణ్యములలోఁగల పండ్లచెట్ల నఱికివేయ నాజ్ఞాపించెను. యవను లామరుసటి నిముసముననే పండ్లచెట్లను రూపులేకుండ చేసిరి. నలుగురు కూఁతు, లెనమండ్రు కొడుకులతో, పాటేశ్వరితో ప్రతాపుఁడు సైత, మింకొక యాహారము దొఱకనందున నా కొండలలో మొలచు 'మోలను' గడ్డిని తెచ్చి రుబ్బి రొట్టెలుచేసికొని, తిని కాలము గడుపుచుండెను. 'కాలెడి కడుపునకు మాడెడి గంజి'యను సామెతగా వారు దినములు గడుపుచుండిరి.

ఒకనాఁ డసఫుఖాను సేనలతో నడవులలోఁ దిరుగుచుండఁ బ్రతాపుఁ డరుదెంచి, చెడఱిపోవునట్లు మర్దించి, మధ్యాహ్నవేళకు నివాసభూమి కరుదెంచెను. దర్భాసనముపైఁ బ్రతాపుఁడుండ, నెదురుగాఁ జేతులు గట్టుకొని కృష్ణసింహాదులు నిలచియుండిరి. చెంతనున్న గుహానుండి సేవకుఁడు ప్రతాపునకు పండ్లు, రొట్టెలు తెచ్చియిచ్చెను. ప్రతాపుఁడు కొంచెము రొట్టెముక్కను, ఒక పండు దబ్బను నోటిలో వైచికొని కృష్ణసింహాదులను దగ్గఱకుఁ బిలిచి పండ్లను, రొట్టెలను వారి కొసఁగ, వారు మహాప్రసాదమని పుచ్చుకొని రాణా భుజించినపిదప తాము భుజించుటకై వేచియుండిరి. కడుపునిండ తిండి, కట్టుకొన బట్ట, తలదాఁచుకొన తావైన లేక దారిద్ర్యదేవతవలె నున్న యీ మహావీరులు మున్ను రాజ్యభోగములతో నున్నప్పుడే భక్తిప్రపత్తులతో నెంతగఁ

గొలుచుచుండిరో యంత కినుమిక్కిలిగఁగొలుచు నీదృశ్యము జూడ వేయికన్నులైనఁ జాలునో చాలవో యనిపించుచుండెను.

ఇంతలో యవనసేనలతో, మదపు టేనుఁగు నెక్కి మానసింహుఁడు వచ్చుటఁ జూచి యున్నవారున్నట్లే లేచి పోరాడనరిగిరి. ఉభయసేన లెదిరించెను. కత్తులు పూలమాలలగుచుండెను. వేఁటకాండ్రవలె మొగలు వీరులు విజృంభింప సింహములవలె రాజపుత్రులు విక్రమించిరి. సూర్యాస్తమయము కాగా పోరునిలచెను. యవన సేనానులు విడివిడిగాఁ బోయి మఱికొన్ని దుర్గముల వశపఱచుకొనిరి. కొందఱు సేనానులు ప్రతాపుని చెఱఁబట్టుటకు నలువంకలఁ జుట్టుముట్టుచుండిరి. అమానుష పరాక్రముఁడగు ప్రతాపుఁడు, ప్రతిదినము సాయంకాలము వఱకు శత్రు రక్తముల వసంతములాడి వచ్చుచుండెను.

ఒకనాఁ డుదయము రాణా నిదుర లేచి చూచునప్పటికి తాయున్న కొండ నలుప్రక్కల, నేల ఈనినట్లు, మొగలు సేనలు కనిపించెను. శ్యామసింహునిఁ గుటుంబ రక్షణకు నిలిపి, వేఱొక ప్రాంతమునఁ బోరాడనరిగెను. రాయసింహ కృష్ణసింహులు, అబ్దుల్లాఖాను ప్రతాపులు, భీమచాంద్ ఖాసింఖానులు, మహాబత్ఖాను లొండొరుల నెదిరించిరి. ఆఁకలిగొన్న సింగములవలె శిశోదియా వీరులు వైరుల తలలు నఱుక సాగిరి. అసఫుఖాను వెనుకనుండి ముట్టడించెను. ప్రతాపుఁ డాసఫు నెదిరించెను. కృష్ణసింహుని ధాటికి రాయసింహుని బలములు వీనుఁగు పెంటలయ్యెను. ఫరీదుఖాను దుర్జయులఁ

పెచ్చు పెరిఁగి పోరాడుచుండిరి. మొగలు సేనానులు విఱిగి పాఱుటఁజూచి, సేనానులు ఫిరంగులకు పనిగల్పించిరి. పదాఱు వందల సేనానాయకులున్నను, ప్రతాపుని గెలువలేక పోయితి మని వగచు నక్బరునకు ధైర్యముచెప్పి విఱుగఁబొడిచెదనని వచ్చి, తాను తుదకిట్లయితినని తలఁచి, ఈసురోసములతో ఖాసింఖాను, ఫిరోజీతో కలసి, ప్రతాపు నెదిరింపఁ బోవ భీమచాందు భిల్లబలములతో నడ్డుపడెను. భిల్లనాథుని చేతి పుట్టెడుక్కుగదకు బని నిండుగ నుండెను. సేనలు గదాధారి యగు భీమచాందును కాలయముఁడని తలఁచి, పరువులెత్త సాగిరి. వడదెబ్బకు తూలెడువారికి కాసారము గనిపించి నట్లు వీరబలుఁడు క్రొత్త సేనలతోఁ బాఱిపోవు మొగలులకు కనిపించెను. పోరు ఘోరమాయెను. ఇంతలో శ్యామ సింహుఁ డరుదెంచెను. రాజపుత్రు లుత్సాహముతోఁ బోరుచుండ, యవనులు, పులినాకి విడిచిన తీఁగలవలె గడ్డి గఱచిపోఁదొడఁగిరి. చీఁకటు లలముకొన్నట్లు భిల్లులు విజృం భింప వందలకొలఁది రాజపుత్రులు యవనుల తలలు నఱికి కుప్పలు పోయఁదొడఁగిరి. సూర్యుఁ డస్త శిఖరి ప్రాలుటఁ జూచి కృష్ణసింహుఁడు ప్రతాపునిఁ జేరి, "దేవా! ప్రొద్దు గ్రుంకినది. ఈనాఁడు మొగలులఁ గడతేర్చి వచ్చెదము. మీరు కుటుంబముకడకు పొండు. శ్యామసింహుఁడు సైతము వచ్చెను గదా! రాజ్ఞీమణి బిడ్డలతో నొంటరిగ నున్న"దని పలికి ప్రతాపుని సాగనంపెను. ప్రతాపుఁడు బిలముకడకు వచ్చు నప్పటికి బిడ్డ లాఁకలి కేడ్చి యేడ్చి నిదురించిరి. పచ్చి గంగ యైన ముట్టక వారా రాత్రి గడపిరి.

ఉసిరికకాయలంత చినుకులతో మొదలై, యేనుఁగు తొండములు బ్రేలఁగట్టినట్లు నేకధారగా కుండలతో ముంచి పోసినట్లు వాన కురియుచుండెను. గాలిరేగి గాలివానయై ప్రళయమును దలపించెను. కనులు మూసికొన్నను, ధగధగ మను మెఱుపులు కన్నులఁ జీల్చుచుండెను. అడవిలోని చెట్లలో నూటికొకటైన నిలువకుండ విఱిగిపడుచుండెను. పిడుగులు పడుచుండ, నా వేళలో నెట్టివారి గుండెలైన దడ దడలాడకపోవు. ఏఱులు మ్రోఁతలెత్తి పాఱుచుండెను. ఆ గాలివాన కా కొండలో, రాణా కుటుంబముతో నుండెను. పిల్లలు తడిసి ముద్దలై చలికి బిగుసుకొనిపోయిరి. కప్పుకొనుటకు గుడ్డయైన లేక, యా దంపతులు శివరాత్రివలె నా రాత్రి జాగరణ మొనరించిరి.

తెల్లవాఱినది. వాన తగ్గినది. భిల్లుఁడు పోయి గడ్డి తెచ్చెను. రాణి దుబ్బు రొట్టెలుచేసి బిడ్డలకిచ్చి మగనిచెంత రొట్టెలుంచెను. ప్రతాపుఁడు దేవుని ప్రార్థించుకొనుచుండెను. ఇంతలో నొక పిల్లివచ్చి చెంత నాడుకొనుచున్న పిల్లఱొమ్ము గీరి, చేతిలోని రొట్టెను దీసికొనిపోయెను. పిల్ల కెవ్వమని కేక వైచెను. రాణి పరుగునవచ్చి బిడ్డనెత్తుకొని, సముదాయించు చుండెను. రాణా కనులువిప్పి చూచెను. బిడ్డఱొమ్మున నెత్తురు క్రమ్ముచుండెను. వజ్రపంజరమైన యాతని హృదయము నీళ్ళకన్న పల్చనై కరఁగిపోయినది.

"పది పండ్రెండేఁడ్లనుండి జరుగు పోరాటములకుఁ గాని, కోటలు, సేనలు, కోశము నశించినఁగాని గెలుపు దొరకలేదని నేను విచారింపలేదు. ఆపదల ననుభవించు

టకే వీడుఁడు పుట్టినాఁడని నమ్మి, కష్టముల కోర్చుకొను చుంటిని. నోరులేని యీ నెత్తురుకూన లనుభవించు కష్టములఁ జూచి యోర్వలేకున్నాను. దాసీజనముల యుపచారములతోఁ బెరుగవలసిన వీరీనాఁడు తిండికి మొగము వాచిపోవుచున్నారే! వీరిలో నొకఁడైన నదృష్టజాతకుఁడు లేఁడా! నా పిదప దేశ మేలవలసిన యమరసింహుఁ డీల్లు కష్టపడుచున్నాఁడే? క్రోలు పులి పిల్లికూన యగుచున్నదే! తూగుటుయ్యాలలలో నూఁగ వలసినవారికి పడియుండుటకు బండలే దిక్కాయెనే! నా పూర్వపుణ్యాలతలు పూచిన మందారపుష్పము పాటేశ్వరి పట్టపురాణియై సుఖించుటకు మాఱు నేఁడు గర్భదారిద్ర్య మనుభవించుచున్నది. దినమెల్ల రొట్టెముక్కలతోఁ గడుపు నింపుకొని కండలు పులియునట్లు పోరాడవలసి వచ్చుచున్నం దున శరీరమున నెముకలు బయటపడుచున్నవి. ఇనుమైనను నా దేహ మీశ్రమల కెన్నాళ్ళు సహింపఁగలదు? కూటిపేద కైన తలదాఁచుకొన గుడిసె యుండునే? రాణా కుటుంబమున కదియైనను కఱవాయెను గదా! మఱల తిండి దొఱకులోన నేవైరు లరుదెంతురో? ఈ కడుపుకోఁత భరింపలేను.”

ఈ విధమునఁ బ్రతాపుఁ డొకింత సేపాలోచించి, తాటాకుపై గంటముతో నేదియో వ్రాసి, చెంతనున్న భిల్లుని చేతికిచ్చి “దీనిని తీసికొనిపోయి యక్బరున కి”మ్మని చెప్పి వానిని పంపి మఱల ధ్యానమూనెను. అతని మోమున విషాదము గోచరించుచుండెను. రాణి వచ్చి మగని మొగము నందలి దిగులునకుఁ గారణ మరయుచుండెను. ఇంతలో రాణా కన్నులు తెఱచెను.

పాశేశ్వరి :—(భర్తకు మ్రొక్కి) నాథా! రత్న సింహాసన మెక్కి రాజ్యమేలునాళ్ళలోఁ గాని, కొండగుహలలో నుపవసించునాళ్ళలోఁ గాని చిఱునవ్వులు చిందులు ద్రొక్కు మీ మోమున నేఁ డెన్నఁడులేని దిగులు తొంగిచూచుచున్నదే? ఆఁకలియగుచున్నను రొట్టెలను దినకున్నారే? ఏ దుష్కర కార్యభారము మి మ్మాకులపఱచెను? నేలపైఁ జూపులుంచి, అదే పనిగ నాలోచనతోఁ జూచుచున్నారే! మీరు ప్రకృతి కతీతులే. మీ రేల విచారించుచున్నారు? 'ఆపదలందు ధైర్యగుణ' మను సూక్తికి మీరు పట్టుగొమ్మ కదా! మీ విచారమునకుఁ గారణ మెఱిఁగింపఁ గోరుచున్నాను.

ప్రతా:—(దయగల చూపులతో) ప్రేయసీ! నా యర్ధాంగివగు నీకుఁ దెలుపక యింకెవరికిఁ దెలుపుకొందును? ప్రాసాదములలో, బంగరు తూఁగుటూయలలో సుఖింపఁదగిన మీరు నా దురదృష్టమువలన నిడుమలందుచుండఁ జూడఁ జాలకున్నాను. వీరాధివీరుని భార్య తలదాఁచుకొనఁ దావు లేక పిల్లివలె బిడ్డలను బొట్టకంటించుకొని తిరుగుచుండఁ జూచి, యే కటిక గుండెవాఁ డోర్చుకొనఁగలఁడు? మీ రిన్ని కష్టములు పొందుచుండ నే నేమేలుఁగోరి పోరాడుచుంటినో తెలియకున్నది. ఏండ్లకొలఁదిగ నీవు, బిడ్డలు పొందు కష్టములను జూచి యోర్చుకొనఁగలిగితిని. నిన్నటినుండి తిండి లేక యాఁకలికి మాఁడుచున్న బిడ్డచేతి రొట్టెను బిల్లి తీసికొని పోవుటయే కాక, బిడ్డ ఱొమ్ము గాయముచేసినదే! నెత్తురులు గ్రమ్ము ఱొమ్ము, కెవ్వనుని బిడ్డ వైచిన కేక నా గుండెను గరఁగించినవి. "ఆఱుమాసములు విశ్రాంతి కావలయును,

ఏడవ నెలకు పోరాడుటకు సిద్ధముగా నున్నా''నని జాబువ్రాసి, నే నిప్పుడే భిల్లునిచేత నక్బరునకుఁ బంపితిని. జాబుపంపినది మొదలు నా మనస్సు సంకోచించుచున్నది. నా వంశగౌరవమునకు లోపము గలిగించితినను భయము గలుగుచున్నది.

పాటేశ్వరి :—(ఆశ్చర్యముతో) పొరపాటన నెట్టిదో యెఱుఁగని మీరు ముందువెనుక లాలోచింపక తొందరపడరే! యుద్ధమున కాఱునెలల గడువు గోరితిరా? ఏడవనెలలోఁ దిరిగి యుద్ధము తప్పనిచో నిప్పుడు గలుగు ప్రయోజనమేమి? ఈ గడువువలనఁ బగవారి యాయువు నాఱునెలలు హెచ్చించితిరి. మీ కత్తి యన్నాళ్ళవఱ కింత పదునుగనుండి పగవారి తలలు నఱుకఁగలదా? మీరు వీరాధివీరులే! క్షణమైన తీఱిక లేక కార్యసాధకుఁడు రేయింబవళ్లు పాటుపడవలయునే! స్వాతంత్ర్యదీక్షకై సర్వస్వ మర్పించి పనిచేయువారలే! పౌరుషోద్యోగము లను కారు మబ్బులకు నుడిగాలి వంటి విశ్రాంతి నేల కోరితిరి? ఆఱుమాసము లూరకున్న సోమరిపోతు మరల నేడవ నెలలోఁ గష్టించి పనిచేయఁగలఁడా?

భారతమాత కడగండ్ల నొందుచుండ, ప్రజలు కష్టపడుచుండ, మానవతుల మానము నశించుచుండ, కుటుంబ సౌఖ్యములు గోరి స్వాతంత్ర్య రణమును విరమింతురా? లోకము పుట్టినది మొదలు కని విని యెఱుఁగని దీక్షఁదాల్చి నిర్వర్తించుచుంటిరే! మీవలన మీకులము ధన్యమైనది. సానఁబట్టినకొలఁది వజ్రము, రుద్దినకొలఁది గంధపుచెక్క, యిడుములందుకొలఁదిఁ బౌరుషవంతుఁడు ప్రకాశించుచుందురు. మీరు విచారింపవలదు. ఉన్న 'యీ సైనికులుగూడఁ బగ'

వారిని గలసిననుసరే! కాసెఁగట్టి, కవచఖడ్గములఁ దాల్చి మీ
కిరుప్రక్కల నేను, బిడ్డలముఁ బోరెదము. మన కుటుంబములోఁ
జివరిబిడ్డ గొంతులో నూపిరియున్నంతవఱకు స్వాతంత్ర్య
యుద్ధము సాగుచుండవలయును. నా కేమియు విచారము
లేదు. మీ మోమునఁ జిఱునవ్వు చిందులాడఁ జూచి సంత
సింపఁ గోరుచున్నాను.

ప్రతా:—దేవీ! నీవు నిజముగ వీరోచితముగాఁ
బలికితివి. కష్టాంధకారములు గ్రమ్మినవేళఁ ద్రోవఁజూపు
వెలుఁగుబాటవు నీవు. నీవంటి యుత్తమసతి నొసఁగిన దైవ
మున కాజన్మాంతము కృతజ్ఞుఁడను. నాకు విసువు గలిగినప్పుడు
నా కోపము దీర్చి, విశ్రాంతినిచ్చి యూరించి, లాలించి,
యుపచరించి, యలరించి, మించి ధైర్యమొసఁగి మనస్సు
కైవస మొనరించుకొంటివి. నీవు నాయండ నున్నంతవఱకుఁ
గోటానుకోటు లాపదలు చుట్టుముట్టినను, స్వాతంత్ర్యపథము
నుండి యంగుళమైనను దాఁటిపోవను.

ప్రతాపుని ప్రతాప గంభీర వాక్యములకు హర్షించి,
పాటేశ్వరీదేవి "మీ దయవలన మంచి మాటలు వింటిని.
ఆరగింపుఁ" డన, లేచి ప్రతాపుఁ డారగించెను. ఇంతలో
సమీపమునుండి జయశంఖధ్వానము వినఁబడెను. కృష్ణ
సింహాదులు వచ్చి యుద్ధ విశేషములఁ దెలియఁజేసిరి. ప్రతా
పుఁడు విని పరమానందమున మునిఁగెను.

మొగలుసేన దినదినమునకుఁ బైఁబడిపోరుచుండఁగాఁ
బోరుచు, గెలుచుచు, వెనుకకుఁ దగ్గుచు, నొగ్గుచుఁ బ్రతాప
స్వామి కొన్నాళ్లు కాలము గడిపెను.

# 6. ఢిల్లీ దర్బారు

రాణా ప్రతాపసింహుఁడు పంపిన భిల్లుఁడు ఢిల్లీ పట్టణముఁ జేరి, సందులు గొందులు దాఁటి రాచబాటలోఁ బోవుచు వారిని వీరి నడిగి పురమధ్య భాగమునఁ గల సింహద్వారముఁ జేరెను. కావలివా రాతని లోనికేగరాదని యడ్డగింప, నతఁడొక ప్రక్క నిలిచియుండెను.

ఇంతలో ఫిరంగులు మ్రోఁగెను. విజయ దుందుభి ధ్వనులు మిన్ను ముట్టెను. కాల్బలములు కోట కిరువైపుల నడచుచుండెను. నడుమ నాశ్వికదళము, రాజోద్యోగులు వచ్చుచుండిరి. పట్టపేనుఁగు నెక్కి యక్బరు వచ్చుచుండెను. పాదుషా రాకను జూచి ద్వారపాలకులు సలామొనరించి, నిలువఁబడిరి. ప్రభువు రాకను జూచి భిల్లుఁడు జాబుగల చేతిని జాఁపి రాజుగారి యేనుఁగున కెదురుగఁబోయెను. అక్బరతనిఁ జూచి 'నీ వెవ్వఁడవు? ఏల వచ్చితి' వని యడిగెను. 'దేవా, రాణాగారు పంపఁగా నీ కొఱకై యీ జాబు దెచ్చితి' నని భిల్లుఁ డాజాబిచ్చెను. అక్బరు జాబు చేతికిఁ దీసికొని, లోలోనఁ జదువుకొనెను. అతని మోమునఁ జిఱునవ్వు మొలకెత్తి యానందబాష్పము లురలుచుండెను. ఆ జాబు జేబులో నుంచుకొని పాదుషా భిల్లునితో నంతిపురి కరిగెను.

ప్రతాపునికడనుండి భిల్ల రాయబారి వచ్చినాఁడను వార్తవిని, పౌరులు పురమునలంకరింప సాఁగిరి. మొగలు ధ్వజములు కులుకసాగెను. అరఁటికంబములు నాటి మామి

డాకుల తోరణములు గట్టిరి. దేవాలయములలో, మసీదులలోఁ బ్రార్థనలు జరుగుచుండెను. రాజాజ్ఞచేఁ బేదల కన్నదానము గావింపఁబడెను. 'నేఁటి మధ్యాహ్నమున సార్వభౌముఁడు కొలువుదీఱును. సభ్యులు, సామంతులు, సేనానులుఁ గొలువు కూటమునకు రం'డను చాటింపు వినఁబడెను.

సభాభవనమున మంత్రులు, సామంతులు, సేనానులు, కవులు, పండితులు, గాయకులు, వర్తకులు నుచితాసనములం దుండిరి. సింహాసనమునకుఁ గుడివైపున యువరాజు సలీము కూర్చుండియుండెను. రాజబంధువు లొకవైపున నుండిరి. ఇంతలో దుందుభులు మొఱసెను. మదగజము నెక్కి పాదుషా వచ్చుచుండెను. అతని వెనుక భిల్లుఁడు బంగరుపల్లకిలో సభాభవనముఁ జేరవచ్చెను. సభ్యులు పాదుషారాక నెఱిఁగి లేచి నిలువఁబడిరి. పాదుషా సింహాసనము దరికిఁబోయి కూర్చుండెను. గౌరవసూచకముగా ఫిరంగులు మ్రోఁగించిరి. గొంగడి కప్పుకొని, కఱ్ఱపట్టుకొని, భిల్లుఁడు సభలో నక్బరు చూపినచోటఁ గూర్చుండెను.

అక్బరు :—సభాసదులారా! మీకొక సంతోషవార్త నెఱిఁగించుట కుత్సహించుచున్నాను. ఇట్టిది నేను చెప్పి యుండినదియు లేదు, మీరు వినియుండినదియు లేదు.

అని పలికి, ప్రక్కనున్న పృథ్వీరాజును జూచి "యీ జాబు చదివి వినిపింపుఁ" డని భిల్లుఁడు తెచ్చియిచ్చిన తాటాకు నిచ్చెను. అతఁడు దాని నందుకొని చదువలేక తడబడుచుండెను.

అక్బరు :—మీ రేల చదువ లేకున్నారు? అట్లేల విచారముతోఁ జూచుచున్నారు?

పృథ్వీరాజు :—దేవా! సభకు వచ్చినది మొదలు కనులు పచ్చనై యక్షరములు కనుపించుట లేదు. మీకుఁ జెప్పుకొనుటకు లజ్జించుచున్నాను.

అక్బ రతనిని గూర్చుండ నాజ్ఞాపించి, యబ్దుర్ రహిమానును జూచి, చదువుఁడని పలికెను.

అబ్దుర్ :—దేవా! పదినాళ్ళనుండి యారోగ్యము చక్కఁగ లేదు. నిలువఁబడుటకు శక్తి లేకున్నది. నీయాజ్ఞ యనుల్లంఘ్యమగుటవలన నెట్లో సభకు వచ్చితిని.

అక్బరు :—అయ్యో! ఈ విషయము ముందే యేల తెలుపరైతిరి? పోనీ, పల్లకి నెక్కి యింటికిఁబోయి విశ్రమింపుఁడు.

అబ్దుర్ :—దేవా! మిక్కిలి శ్రమగ లేదు. ఇక్కడనే యుండెదను.

అక్బరు తాటియాకుఁ జూచి మృదుమధురముగఁ జదువఁదొడఁగెను.

"అక్బరురాజా!

క్షేమము. క్షేమములఁ దెలుపఁ బ్రార్థన. ఎడతెఱిపిలేని యుద్ధములవలన జబ్బుచేసినది. విశ్రాంతి కావలసియున్నది. నీ కిష్టమైనచో నాలుగు నెలల గడువీయఁ గోరుచున్నాను. ఏడవ నెల మొదలు పెట్టుటతోడనే యుద్ధమునకు సిద్ధముగ నుందును.

ఘగవాఁడవైనను బుద్ధిమంతుఁడవు, నా మంచిచెడ్డ లెఱింగిన వాఁడవని తెలిసి నిన్ను గడువడుగుచున్నాను. నీ యభి ప్రాయము దెలుపఁగోరుచున్నాను.

ఇట్లు,
ప్రతాపసింగు."

అని చదివి యక్బరు "ఈ కాలమందలి వీరాధివీరులలో నగ్రగణ్యుఁడగు రాణాప్రతాపసింహుఁడు పడుచున్నయిడుమల నీ వార్తమూలమునఁ దెలిసికొనవచ్చును. ఆతని పరిస్థితులు విషమించినట్లుఁన్నవి. దీనినిబట్టి చూడ నచిరకాలమున నాతఁడు సంధికి రాఁగలఁడని తోఁచుచున్నది. దీనికిఁ బ్రధాన కారణమైన మానసింహుని మన మభినందింపవలసియున్నది. ఈ యానందవార్తను దెలుపుటకే మిమ్మెల్లరఁ బిలిపించితి" నని పలికెను.

సభలోఁ గలకలము చెలరేగెను. సంధి జరుగుననియుఁ, బ్రతాపుఁ డోడుననియు, నాతనిని బదివేల గుఱ్ఱపురౌతుల కధిపతిని గావింపవలయుననియు సభ్యులు తలకొకమాట పలుకుచుండిరి. అక్బరు సభ్యులను జూచి, 'ప్రతాపుఁడు మన స్నేహమును గోరుచున్నట్లున్న' దని పలికి పృథ్వీరాజును జూచి 'మీరు నిలచియేయున్నారా? కూర్చుండుఁ' డని పలికెను.

పృథ్వీరాజు :—దేవా! నేను నీ సేవకుఁడను గనుక నాకుఁ దెలిసినంతవఱకుఁ దెలుపుట భావ్యమని తలఁచు చున్నాను. ఇది ప్రతాపుని చేతిమీఁదుగ వ్రాయఁబడిన లేఖ

గాదు. కైలాసశిఖరముకన్న స్వచ్ఛమగు నాతనికీర్తి నోర్వని వారెవరో యిట్లు కల్పించి వ్రాసి పంపియుందురు. ఇది ముమ్మాటికి సత్యము. భక్తుఁ డిష్టదైవము నారాధించినట్లు స్వాతంత్ర్యదేవత నర్చించు నా మహానుభావుఁడు కొనయూపిరితో నున్నంతవఱకు, నీకు లోఁబడుననుమాట నీళ్ల మూట యని నమ్ముము. విషయసుఖములకుఁ జిక్కక, యింద్రియముల గెల్చిన యీ మహాత్ముఁడు నీకు లొంగి చేచాఁచుటయే జరిగిన చంద్రసూర్యులు గతులుదప్పరా? లోకములు క్రుంగిపోయినను, నీ యంతట నీవుపోయి, ఢిల్లీసామ్రాజ్యమెల్ల నర్పించితి ననినను, చేత ముట్టుటకునైన నిష్టపడనివాఁ డా ప్రతాపుఁడు. తననుగూర్చి ఢిల్లీదర్బారులో నిట్లు చర్చ జరిగినదని వినినను, నా మహాత్ముని మనస్సు మిక్కిలి క్షోభింపకమానదు. 'అక్బరేమో తెలివిగలవాఁ డందురే? ఆతని బుద్ధి విశేషము లింతేనా? నిజమో, కల్లయో తెలిసికొనఁ జాలఁడా?' యని తలఁచును. ఇదివఱ కాతనికి నీయందుఁగల మర్యాదయైనను మీ దెబ్బతో నూడిపోఁగలదు.

అక్బరు :—పృథ్వీరాజా! ఏల యింత చిత్రముగ మాటాడెదవు? ప్రతాపుని గొప్పతనము నెవరు కాదనిరి? వారి కుటుంబము వీర కుటుంబమని యెఱుఁగనివారు దేశములో నున్నారా? ఆయనపై నాకుఁగల మర్యాదకు, దర్బారునకు బంగరు పల్లకిలో నెక్కివచ్చిన యీ భిల్లుఁడే సాక్షి! ఇదుగో! తాటియాకు. దీనిలోని ప్రతాపుని సంతకము జూడుము. ఈ భిల్లునే సత్యాసత్యము లడిగి తెలిసికొనుము.

పృథ్వీరాజు :—దేవా! ఈ జాబు చివరి సంతకమునకు, నిజమైన సంతకమునకుఁ గావలసినంత పోలిక గలదు. కాని యిది సత్యమైన జాబుగాదు. నే నీ జాబును నమ్మ లేదు. అసలువిషయ మిది. ఇతరు లెవ్వరో ధనమిచ్చి యీ భిల్లు నీ జాబుతో నిచ్చుటకుఁ బంపియుందురు. ఈ కాలమునఁ జేత ధనమున్నచో లోకములు తలక్రిందు చేయవచ్చును. అంత శ్రమయేల? మీ రంగీకరించినచో నమ్మకమైన సేవకునిఁ బంపి యీ జాబు యాథార్థ్యము తెలిసికొని సత్యమును మీకు విన్నవింపఁగలను. అంతవఱకు మీ రీ జాబును నమ్మవలదు.

మానసింహుఁడు :—దేవా! సభాసదులారా! ప్రతాపునితో నా కాగర్భశత్రుత్వమున్నను నున్నమాట యనక తప్పదు. సూర్యచంద్రులు త్రోవలు తప్పినను ప్రతాపసింహుఁడు స్వాతంత్ర్యమార్గమునుండి యడుగు గావలు వైచువాఁడు కాఁడు. దేశదేశముల జయించిన నావంటి వీరునితోఁ బోరుట మాటలా? అతఁడుకనుక నంతమాత్రమైనఁ బోరుచున్నాఁడు. ఇప్పటికే పోరు ప్రతాపునకుఁ దలమునుకలైనది. ఇఁక నాతఁ డెంతకాలమో పోరాడలేఁడు. ఇప్పటికే మేవాడ రాజ్యలక్ష్మి యనాథయైనది. దుర్గములు కూలినవి. యోధులు మడిసిరి. వస్తుసంపత్తి శూన్యమైనది. సైన్యము దైన్యమందినది. కట్టుగుడ్డలతో, నాఁకలిమంటలతో నున్న బింకము సైత మూడినది. స్వాతంత్ర్యపిపాస చల్లాఱినది. ఇట్టి నిరుపేద పోరాటము సన్యాసిపెండ్లి వంటిది గదా? ఈనాఁటికిఁ బ్రాణములమీఁదఁ దీపిచేఁ బ్రతాపుఁడు వచ్చి

చావక గడువు కోరినాఁడు. ఈ గడువు దాఁటిదాఁటకముందే యతఁడు పాదుషా పాదములపై వ్రాలి తన యవినయమును మన్నింపుమని ప్రార్థింపఁగలఁడు.

పృథ్వీరాజు:—నాకేమో మానసింహు నభిప్రాయము నమ్మకము గలిగించుటలేదు. ఆ ప్రతాపుఁ డెన్ని కష్టములు వచ్చినను మానవమాత్రుల నాశ్రయింపఁడు. కోటానుకోట్ల వైరులు చుట్టుముట్టినను జివుళ్లవలెఁ దలలుగిల్లి వేయఁగలఁడు. ఉపకరణములు లేనివాఁడని మన మాతనిఁ జులకన చేయఁ గూడదు. మహాత్ముల కుపకరణములతోఁ బనియేమి?

అక్బరు:—మానసింహా! మనము మాత్ర మీ పృథ్వీరాజు మాట నేల కాదనవలయును? ఇక్కడనున్నవారిలో నెల్ల నితఁ డొక్కఁడే ప్రతాపున కాత్మబంధుఁడు. ఆ మహాత్ముని విషయముల నీతఁ డొక్కఁడే బాగుగఁ దెలిసినవాఁడు. కనుక, మనము తొందరపడక యున్న విషయములు నెమ్మదిగా నాలోచింపవలసియున్నది. ఇప్పుడుమాత్రము మించిపోయిన దేమున్నది? (అని పృథ్వీరాజువంకఁ జూచి) పృథ్వీరాజా! నీవు నమ్మకమైన సేవకు నొకనిఁ బంపి ప్రతాపుని నిశ్చయముఁ దెలిసికొని వచ్చి తెలియఁజేయుము. అంతవఱకు మేవాడపైకి మొగలు సైన్యము లేగరాదని సేనల కాజ్ఞాపింతును.

అని పలికి యక్బ రంతఃపురమున కరిగెను. సభ్యు లెల్లరుఁ దమతమ యిండ్ల కరిగిరి.

# 7. సందేశము

పృథ్వీరాజు భిల్లుని వెంటఁగైకొని యింటి కరిగెను. భార్యయగు జోషీబాయి విషయమువిని భిల్లునిఁజూచి ప్రతాపాదుల కుశలము లడుగసాగెను. "భిల్లుఁడా! జాబు వ్రాయునప్పు డాయన భావమేమి? ఆయన మోమున విషాదచ్ఛాయలు గోచరించెనా? పాటేశ్వరీమాత చెంత లేదా? ఆమె కీ విషయము తెలియునా? కృష్ణసింహాదు లీ విషయము నెఱుఁగుదురా? అమరసింహాదులు క్షేమమేనా?" యని యా భిల్లు నామె ప్రశ్నల వర్షముతో ముంచివైచెను.

ప్రతాపుని విషయముల కొక్కొక్కటిగ భిల్లుఁడు బదులు పలుకుచు, నంతకు ముందు రాత్రివఱకుఁ బోరుచుండెననియు, గాలివానతో వారు రాత్రి తిండిలేక గడపిరనియు, పిల్లతొమ్మ్మ గిల్లి పిల్లి రొట్టె తీసికొనిపోయినదనియు, రాణా మనస్సు కరఁగి జాబువ్రాసినాఁడనియుఁ బలుకుచుండ సతీపతులు కన్నీటికాలువలు పాఱించుచు వినుచుండిరి. జోషీబాయి విషయమెల్ల విని "లోకములో మిద్దెలు, మేడలు, భోగభాగ్యములు గలిగియున్న మగనిని సేవించుట కీనాఁటి మానవతులు విసువుకొనుచుండిరే? మా పాటేశ్వరీమాత యాగర్భశ్రీమంతురాలయ్యు తినుటకుఁ దిండి, కట్టుటకు బట్ట, నిలువ గుడిసె లేక చంటిపిల్లలతో నడవుల నిడుమలఁబడుచు భర్తను గొలుచుచున్నది. అట్టి పతివ్రత లీ భూమండలమున వేఱెవరైనఁ గలరా" యని విచారించుచుండఁ దన వంశ

మును భావన మొనరింపవచ్చిన జోషీబాయిదిగులు చూడ రాదను కారణముననేమో యన్నట్లు సూర్యుఁ డస్తమించెను.

పృథ్వీరాజు తన యింటివెనుక నున్న యారామభవనమునఁ బడకకుర్చీలోఁబరుండి యాలోచించుచుండెను. కొంచెము సేపాలోచించి కలముఁగొని కాగితముపై నేదో వ్రాయఁ బూనెను. ఇంతలో సేవకుఁడు వచ్చి 'ప్రధానమంత్రి వచ్చియున్నా'రని పలికెను. అతఁడు పోయి యబ్దుర్ రహీముఖానును దీసికొనివచ్చి కూర్చుండఁబెట్టెను.

పృథ్వీరాజు :— పదినాళ్ళుగా నారోగ్యము సరిగా లేదని మీరు సభలో ననినది మొదలు నాకు మీ కుశలమెట్లుఁగ నాతురముగ నున్నది. ప్రస్తుతము మీ యారోగ్యమెట్లున్నది?

అబ్దుర్ రహీముఖాన్ :—మిత్రమా! నా యారోగ్యము చక్కఁగానే యున్నది. అప్పటి నా యాంతర్యము తెలుపవలయుననియే నేనిటకు వచ్చితిని. రాణాగారి జాబు చూచుటతోడనే నా మనస్సు పటాపంచలై పోయినది. "ఆ మహామహుఁడు తన గొప్పదనము తగ్గించుకొని నేఁడే యక్బరు కాళ్ళదగ్గఱ నిలుచునంతటి దుస్థితికలుగవలయునా?" యను విచారము గలిగి కాళ్లు నేలలోనికిఁ జొచ్చుకొనిపోయి నట్లుండెను. ఆ దిగులు జాబు చూడలేక చదువ సమ్మతింపక యారోగ్యము బాగుగా లేదని బొంకితిని. పుట్టినది మొదలు బొంకుటెఱుఁగని నాకుఁ బ్రతాపుని దైన్యపు జాబు చూచుట తోడనే నా సత్యవ్రతము నాకుఁ దెలియకుండ జాఱిపోయినది. ఎట్టులో కష్టముమీఁద జ్వరమని బొంకితిని. అనృతదోషమునకైన నోర్తునుగాని ప్రతాపుని దైన్యమున కోర్వఁజాలను.

పృథ్వీరాజు :—మీ యారోగ్య వార్తకు మిక్కిలి సంతసించితిని. ఆ జాబు చూచుటతోడనే నిలువునఁ బాతాళమునకుఁ గూలిపోవుచున్న ట్లనిపించినది. అంత మహాత్ముఁ డింత తగ్గుదల కంగీకరించెనే యని బాధపడి కనులు పచ్చగా నున్నవని బొంకి తప్పించుకొంటిని. ఆ సమయమున నాకు నోట మాట రాలేదు. జాతిబొమ్మవలెఁ గదలక నిలిచిపోయితిని.

అబ్దుర్ రహీమార్ :—(నవ్వు మొగముతో) మీరు చివరకు మంచిపని చేసితిరి. సభవారెల్లరు మిమ్మభినందించిరి. ఈ జాబు సత్యముఁ దెలిసికొన నాప్త మిత్రునొకనిఁ బంపి విషయము దెలిసికొనుటకుఁ బాదుషా యనుమతిని బొందితిరి. అవిరళత్యాగమూర్తి యగు ప్రతాపుఁడు కసవు రొట్టెలఁ దిని, స్వచ్ఛ జలములఁద్రావి కామధేనువవలెఁ బాటుపడు చున్నాఁడు. ఆతని యాదర్శముల వృద్ధిచేయ మనకెల్లరకు బాధ్యత గలదు. హృదయమున్న పౌరుషవంతుఁ డెవఁడైన నా మహాత్ముని ముఖ్ప్రాంటఁ బూజింపకుండఁ గలఁడా! అతని కొక విజ్ఞప్తిని వ్రాసికొనివచ్చినాను. దానిని మీరు సవరింపుఁడు.

పృథ్వీరాజు :—(లేఖ నందుకొని) అయ్యా! నీవు వ్రాసిన జాబు చదివి సవరింపఁగలనా! చదువఁగలిగిన యదృష్టమే చాలును. (అని జాబు నామూలాగ్రముగఁ జదివి) మంత్రివరేణ్యా! నీ లేఖాంశములు నా మనస్సునకు వచ్చినవి. నీ వెంత మహాత్ముఁడవు! ఆ రాణాగారి మీఁద నీకెంత భక్తి గలదు! దీనికి నీ సంతక మొకటున్నచో శిరమునకుఁ గిరీటము గూర్చినట్లుండును.

అబ్దుర్ రహీంమార్జా :— (దిగులు మొగముతో) అయ్యా! లోకపావనుఁడైన యా మహామహుని కడగంటి చూపైన నోకు నదృష్టము నాకుఁ గలదా? నే నెవఁడనో యాతఁ డెఱుఁగఁడే! తన మతమునకు విరుద్ధ మతస్థుఁడ నే కాక యతని విరోధి యగు నక్బరునకుఁ బ్రధాన మంత్రినే! తెలిసియో, తెలియకయో యతనికిఁ దవిలిన యాపదలకు బాధ్యుఁడనైన నావంటి తుచ్ఛ మ్లేచ్ఛుని సంతకముఁ జూచి కోపించునేమో! ఆయనకు విచారము గలిగింపఁ గలనా? పాలకుండలో విషముగలుపు పచ్చి కసాయివాఁ డున్నాఁడా! ఈ జన్మమున నాతని దర్శన స్పర్శనాది భాగ్యములు లేకున్నను బ్రతికినన్నాళ్లు నాతని పవిత్రనామము జపించు కొనఁగలిగిన యెడల ధన్యుఁడను. నీ వాతనికి బంధుఁడవు. కవిరాజవు. నీ సంతకే మిందుండఁదగును.

పృథ్వీరాజు :— మంత్రిశేఖరా! నా మనమునకు విస్మయము గలుగుచున్నది. నీ గుణములఁ గొనియాడ నే నెంతవాఁడను? నీ వీరపూజాసక్తి, మతసహనము, మధుర హృదయము మా కాదర్శములుగాఁ దగియున్నవి. ఇట్టి నీ వేకులమునఁ బుట్టినను నా కులమునకు మణిపూసవంటి వాఁడవు. ఉత్తమోత్తమ భారతీయుఁడవు! ఈనాఁటి క్లిష్ట పరిస్థితులలో భక్తిరసమూరు నీ లేఖ ప్రతాపున కంగీకారము కాఁగలదు. ఇది రాణాగారికి విరజాజిమాల గాఁగలదు. మన కన్న ధన్యు లీలోకములో లేరు. ఆప్తుఁడవగు నీ యానతి నతిక్రమింపలేక నేను సంతకము చేయుచున్నాను.

పిదపఁ బృథ్వీరాజు ప్రధానమంత్రి సంతకముచేసి లేఖ నిచ్చి తినుబండారములతో భిల్లుని సాగనంపెను.

శ్రావణమాసము సమీపించెను. హారావళి కొండలలో వానలు కురియసాగెను. యవనులు వానల కెదురేగలేక వెనుకకు మఱలిపోయిరి. ప్రతాపునకుఁ గొంత విశ్రాంతి దొరికెను. భీమచాందు రాణా కుటుంబమును బోయసాళెము జేర్చెను. ఒకనాఁడు ప్రతాపుఁడు రచ్చపట్టునఁ గూర్చుండి యుండెను. ఇరుప్రక్కల భీమచాందు, కృష్ణసింహు లుండిరి. మిగిలినవా రల్లంతదూరమున నొదిగి నిలచియుండిరి. ఆమడకొక యడుఁగుగా భిల్లుఁడు నడచివచ్చి రాణాగారికి మ్రొక్కి మనవిచేసెను. "దేవా! మీ తమ్ముఁడగు సూక్తుని యల్లుఁడు పృథ్వీరాజు, పాదుషా ప్రధానమంత్రియు, దొడ్డగుణములు గలవాఁడగు నబ్దుర్ రహీమాను గలిసి మీకీ లేఖను బంపి" రని పలికి లేఖను బ్రతాపున కొసఁగెను. రాణాగా రా జాబును గృష్ణసింహుని కీయఁగా నతఁడు దానిని జదువసాగెను.

"మేవాడరాజ్యలక్ష్మీ రక్షకుఁడగు రాణా ప్రతాపసింహుల పాదపద్మములకు జోహారులు!

దేవా!

"విశ్వదేవాలయమునందలి మేవాడ గర్భాలయమునందుఁ గల యాదిశంకరుఁడవు నీవు. చిచ్చుఱకన్ను, పులితోలు, చంద్రరేఖ, కైలాసము విడచి భరతఖండమును రక్షింపవచ్చిన పరమేశ్వరుఁడవు. పూలలో నిప్పుపడినట్లు, పాలలో విషము కలిసినట్లు, కంటిలో నలుసు పడినట్లు, మీ

జాబువచ్చి మా మనస్సులు నొప్పించినది. భారతదేశము సౌభాగ్యము మాసి దాస్యాంధకారమున మునిఁగియుండఁ బ్రతాపభానుఁ డుదయించి కష్టములఁ దీర్చినాఁడని మేము హర్షించుచుండ మా పాపముపండి ప్రతాపరవికి లేమబ్బులు సోఁకినవే యని మా మనస్సులు బాధపడుచున్నవి.

"దేవా! ప్రపంచమేలుటకు వలనుకాలేదని నీ వెన్నఁడేని విచారించి యెఱుఁగవే! పార్వతీదేవివంటి పాలేశ్వరీదేవి పడు పాట్లకుఁ గంటనీ రిడకుందువే! చంద్రకళలవంటి పసిబిడ్డలకుఁ గడుపునిండఁ దిండి దొరకలేదని యైన వగలఁబొగులవే! నీ జాబులోని జాలిమాటలకు మా గుండెలు కరఁగిపోయినవి. ధైర్యము విడనాడి విచారింపకుము. దేవునిదయ గలిగినచోఁ బ్రపంచ మెల్ల గెలువఁగలవు. తీఱనికష్టములు వ్యాపించి దారి తెలియని దేశ మను నాకాశమున మెఱపుతీఁగవలె నీ రూపము మెఱయుచున్నది. అక్బరు నిన్ను కొనుటకుఁ దగిన విలువ నెఱుఁగలేక తహతహపడుచున్నాఁడు.

"దేశోద్ధారకా! అభిమానముగల రాజపుత్రుఁ డెవఁడైన నీ నాఁడు నవరాత్ర్యుత్సవములలో యవనచుక్రవర్తి రాజు జరుపు సభలకుఁ దన రాణివాసమును బంపక తన గౌరవమును నిలువఁబెట్టుకొనఁగలఁడా! చిత్తూరును సైతము మంగడులకుఁ దెచ్చి యమ్మింతువా! ప్రపంచమునఁ బ్రకృతిసౌందర్యమును జూచి నీవు సంతసింతువు. అక్బరు దానికి విలువగట్టి కైవసమొనరించుకొనుటకుఁ బ్రాఁకులాడుచున్నాఁడు.

"భౌతిక ధనము లేకపోయినను స్వాతంత్ర్యాభిమాన ధనములు గల నీకీర్తి లోకమున వ్యాపించెను. అక్షరు బ్రహ్మకల్పమువఱకు బ్రతుకఁబోవఁడుగదా! అప్పుడండఱు నిన్నాశ్రయించి నీ స్వాతంత్ర్యరథమును లాగుదురు. కుల మతభేదముల నెన్నక కలుషములఁ బోకార్చు జాహ్నవివలె నీవు యవన సంసర్గదోషమునుండి మమ్ముద్ధరింపఁగలవని మేము నిలుపుకొనిన యాసల నడియాసలఁ గావింపకుము. లోకమునఁగల ప్రతివస్తు వుచ్చనీచతల నరయకుండ కాల వాహినిలో లీనము కాఁగలదు. కాని పేదవడియు, బెండు వడియుఁ, బెంపుసెడని స్వాతంత్ర్యవీరుని కీర్తిప్రతిష్ఠలు శాశ్వతముగా నిలువఁగలవు.

"కాలగర్భమున నెట్టి చిత్రవిచిత్రములు గలవో యెవ్వ రెఱుఁగఁ గలరు? కొండలలోఁ గాఁపురముండి, శిలలే సింహాసనములై, ఘాతుకమృగములే సంగడికాండ్రై, పండ్లే తిండిగఁ గాలము గడుపు నీకు కొఱఁతయేమియుఁ గలుగఁ బోవదు. నీ బాహువులే దేశమును రక్షింపఁగలవనియు, నీ నామధేయమే స్వాతంత్ర్య భానూదయమనియు లోకము నమ్మి నిన్నుఁగొలుచుచున్నది. వెల్లువలవలె యవన వాహినులు ముంచుకొనివచ్చి స్త్రీల పాతివ్రత్యమును, పురుషుల పౌరుష మును నశింపఁజేసినను ప్రళయమున వటపత్రశాయివలె నీవు స్థిరముగ నిలచితివే! ప్రజాహృదయక్షేత్రముల స్వాతంత్ర్య బీజములు నాటుదువని మాకున్న కొండంత యాశను నట్టేట పుట్టి ముంచినట్లు ముంచెదవా! సర్వస్వమర్పించి మేవాడ దేవాలయములో స్వాతంత్ర్యజ్యోతి నిన్నాళ్లు కాపాడిన నీవే

యీ నాఁడు కొండ నెక్కింతువా! మన జీవితములు క్షణ భంగురములు. కష్టములకు లొంగి దేశమును దాస్యమునఁ ద్రోయు పాపమున కొడిగట్టకుము.

"కాలము చాలక నీ చరణసన్నిధిఁ జేరి మనవి చేసికొను నదృష్టము లేని మా దైన్యమును దైవమెఱుఁగును. నీ కాలిలో ముల్లు గ్రుచ్చుకొనిన, మా గుండెలలో నీటె గ్రుచ్చుకొనినట్లు విచారించు మా విన్నపమును ద్రోసివేయకుము. వీర మార్గము వీడకుము. ఇంతకే ప్రళయము ముంచుకొని రాలేదే! ఏల యీ గడువును గోరుచుంటివి? తండ్రీ! స్వాతంత్ర్యభేరి మ్రోఁగింపుము. క్షణమైన విశ్రాంతిఁ గోరకుము. సంగరతరంగముల సంక్షోభ మొందక విపత్సముద్రమునఁ జెక్కుచెదరక నీ స్వాతంత్ర్యనౌక గమ్యస్థానము జేరునుగాక! నీకు స్వారాజ్య పట్టాభిషేకము జరుగునుగాక! పాలేశ్వరీదేవి పార్వతీదేవి వలె సౌభాగ్యవతి యగునుగాక! నీకు బ్రహ్మాయు వగును గాక! నీ యుదాత్తవృత్తము, త్యాగదీక్ష మా మనస్సులలో నిండి యీ రీతి నక్బరు ఋణమునుగూడ మఱపించి నిన్ను గొలువఁ బురికొల్పుచున్నది. మా సాహసమును మన్నింపుము.

ఇట్లు నీ పాదసేవకులు,

పృథ్వీరాజు-ఖాన్ ఖానన్, మీర్జాబ్దూరహిమాన్"

కృష్ణసింహుఁ డీవిధముగ జాబు చదివి కన్నుల కద్దుకొని రాణా పాదములకడ నుంచి మ్రొక్కెను. అప్పు డందఱి మానసములు విచ్చి మోముల నానందతరంగము లుప్పొంగుచుండెను.

ప్రతాపుఁడు :—అక్బరునకు నేను జాబు వ్రాసి దాదాపు నెల కావచ్చినది. ఈ నెలనుండి నామనస్సు సూర్య వంశమున కవమానమేదియో చేసినట్లు జంకుచున్నది. నిందల పాలైతినని తలఁచుచుండ నీ లేఖ వచ్చి నా విచారమును దొలఁగించినది. పగవారి పట్టణమున యవన సభలో నింత నిష్పాక్షికమనస్కు లింత సుగుణవంతులున్నారని యిప్పటికిఁ దెలిసికొంటిని. ఈ మిత్రులు జ్ఞానదీపము వెలిఁగించినారు. నాయజ్ఞానతమము నశింపఁజేసిరి. వా రొనరించిన సాయమునకుఁ గృతజ్ఞుఁడనై వారి నాజన్మాంతము స్మరింపకున్న వారి ఋణము నెన్నటికైనఁ దీర్చుకొనఁగలనా! కష్టమో! సౌఖ్యమో! విజయమో! మరణమో! తేలువఱకు నా యుద్యమమును విడనాడను. పదివేల వీరుల బలము నా భుజమున కిప్పుడు గలిగినది. ధర్మసంరక్షణకై నాతుది నెత్తురు బొట్టునైన మిగిలించుకొనను. ఇదే నా ప్రతిజ్ఞ! రేయింబవళ్లు విశ్రాంతిగొనక రణరంగముననే కాఁపుర ముండెదను.

కృష్ణసింహుఁడు :—(భక్తిప్రపత్తులతో) దేవా! వీ రిరువురుఁ బగవారి కొలువుకాండ్రయ్యు, నిజముగ మనతోఁ బోరాడఁదగినవారయ్యు, నక్బరును వదలి మిమ్ముఁ గొలుచుచున్నారు. వారు మాకు గురుతుల్యులు. ఈ లేఖ కర్పూర హారతి! మావంటి సేవకులుదీనిని బ్రతిదినము పారాయణ మొనరింపఁదగును. నా కిన్నాళ్లు నన్నుమించిన స్వాతంత్ర్యపిపాసి, నీ పాదభక్తుఁడు లేఁడను గర్వముండినది. ఈ జాబుచూచిన పిదప 'నెందఱో మహానుభావు' లనుసూక్తి జ్ఞప్తికివచ్చినది.

ఈ విజ్ఞాపనము నాజ్ఞాపత్రముగఁ గైకొని మా యజ్ఞానమును మానుకొందుము.

భీమచాందు :—దేవా! నా రాజ్యమెల్ల మంత్రి కప్పగించి నీ పదములుగొలువ, మెరియలవంటి యోధులను గొని వత్తును. నీకేమి కొదువ? నా గొంతులో నూపిరియున్నన్నాళ్లు నీ సిగపూవు వాడనీకుండ నీ పదములఁ దలదాల్చి ముల్లోకము లెదిరించినను వెనుదీయక పోరాడెదను.

అని గంభీరముగఁ బలుక నందఱును సంతసించిరి. 'తథాస్తు!' అని కృష్ణసింహుఁడనెను. ప్రతాపుఁడు సంతోషముతో "నిఁక మిక్కిలి భయంకరమగు యుద్ధము జెలరేగఁ గలదు. ఇనుమంతైన విశ్రాంతి గలుగదు. అన్నివస్తువులఁ గైకొని నేఁడే నూర్యమహాలునకుఁ బోద"మని పలికి "మీరు నాకు మిత్రులు. మీ యానతిఁ దలదాల్చితిని. విశ్రాంతి గోర"నని పృథ్వీరాజున కబ్బుర్రహిమానునకుఁ బ్రతాపుఁడు వార్తను బంపెను. వారక్బరునకుఁ "బ్రతాపుఁడు విశ్రాంతిగోరుట యసత్య"మని వార్తను దెల్పిరి.

# 8. నిర్వేదము

ఈమాఱు ప్రతాపుఁ డభిమానమును గాపాడుకొన లేఁడని సైన్యములు హారావళీపర్వతముల నాక్రమించెను. ప్రతాపుఁడు సైన్యములఁ గొని 'యంతల్లా' దుర్గమువద్ద నబ్దుల్లాఖాను నెదిరించెను. యవనులు మదగజములవలె విజృంభింప, రాజపుత్రులు సింగములవలెఁ జీల్చఁదొడఁగిరి. ప్రతాపాదిత్యుఁడు శాత్రవాంధకారమును సమయించుచుండెను. రెండువైపుల సేనలు మిక్కిలి నష్టపడెను. రణము భీకరమాయెను. ప్రొద్దుగ్రాలు వేళకు ఫరీదుఖాను నూత్నసైన్యములతోవచ్చి కలిసికొనెను. రాజపుత్రులకు పోరు భారమాయెను. కోట యవనుల వశమయ్యెను. మిగిలిన కొద్ది దుర్గములను యవనసేనాను లాక్రమించిరి.

చైత్రమాస మరుదెంచెను. యవనులు హారావళి నలంకరించిరి. పాదుషా యానతిపై దేశదేశములఁ బ్రఖ్యాతిగల పలువురు సేనానాయకులు వచ్చి మఱికొన్ని దుర్గములను గెలిచికొనిరి. అంబరుదేశమునుండి, మార్వారుదేశమునుండి మహమ్మదీయులసైన్యము కొండ కన్నిదిక్కులనుండి సూర్యమహలు దుర్గమును ముట్టడించెను. ప్రతాపుఁ డుడివోవని యుత్సాహముతోఁబోరిపోరి వైరివీరులఁ బీనుఁగులఁజేయుచుండెను. తుదకు మహమ్మదీయులు కోటలోనికి రహస్యమార్గమునఁబోవుచుండ నా యర్ధరాత్రి వేళలోవచ్చి దుర్జయుఁ డెదిరించెను. పోరు ఘోరమాయెను. పగవారు ముందునకుఁ జొచ్చు

కొనిపోవుచుండ రాజపుత్రు లగ్నిజ్వాలలవలె విక్రమింపఁదొడఁగిరి. జయలక్ష్మి యవనుల వరింపనుండెను. కోటలో నాహార పదార్థములు శూన్యమైపోయెను. కృష్ణసింహుఁడు ప్రతాపుని దగ్గఱి కరిగి "దేవా! నిగూఢమార్గమున భీమగడదుర్గము చేరవలయు" నన విని ప్రతాపుఁడు సైన్యములతో నరిగెను. సూర్యమహలు యవనుల వశమయ్యెను.

బలము తగ్గినకొలఁది ప్రతాపుఁ డుత్సాహముతో నుండెను. భార్యాపుత్రులను జెఱబట్టినఁ గాని రాణా లొంగఁ డని తెలిసి భీమదుర్గమును గొంత సైన్యము ముట్టడించెను. యవనులకుఁ దుపాకులు తోడ్పడఁజొచ్చినవి. ఫిరంగులకుఁ గోట బీటలువాఱెను. నిమిషనిమిషమునకు యవనసేనలు తఱుగఁజొచ్చెను. నెలదినములుపోరి ప్రతాపుఁడు కుటుంబమును బోయపాళెములో దాఁచియుంచెను. ఆ కుటుంబమును భీమ చాందు 'జావా' గనులలో దాఁచెను.

ప్రతాపుని కుటుంబము భిల్లరాష్ట్రము చేరు టెఱిఁగి మహాబత్ ఖాను సేనల నచ్చటకుఁ దఱిమెను. అతని స్థితి పిచ్చి పట్టినవానిని బోలెను. ప్రతాపుఁడు కుటుంబముతోఁ గైలవార పర్వతసీమలఁ జేరెను. ఉత్సాహముతో, నపజయమును లెక్కింపక, రణదీక్షతో రాణా సేనలు నడపుచుండెను.

ఒకనాఁడు మిట్టమధ్యాహ్నమున చెట్టునీడలో రాణి గడ్డి రుబ్బి రొట్టెలు కాల్చుచుండెను. పిడుగు పడినట్లు ఫరీదు ఖాను సేనలతో వచ్చిపడెను. చెట్లకొమ్మల వంచి ప్రతాపుఁడు కుటుంబమును బుట్టలలోఁ బెట్టి పోరాడ నరిగెను. ప్రతాపుఁడు

పోరుచుండ భిల్లులతో భీమచంద్రుఁ డరుగుఁ దెంచి రాజకుటుంబ మును బోయపల్లెకుఁ జేర్చెను. ఇంతలో షాబాజుఖాన్ గొప్ప సేనతో లోయలోనికి వచ్చెను. సాంకేతిక సహాయమునఁ బ్రతాపుఁడు వెనుకనుండి హఠాత్తుగ యవనులఁదాఁకి నఱకుచు సేనల వెనుకకు నడువ నాజ్ఞాపించెను. సేన వెనుదిరిగి చూచు నప్పటికి రాణా కానరాలేదు. మెఱుపు మెఱసిన ట్లావల దిక్కున కేగి సేనలఁగూల్చు రాణానుజూచి యవను లచ్చెరు వొందిరి. ఈమాఱు వారికిఁ గానరాక ప్రతాపుఁడు దరి కరుగుఁ దెంచినవారిని నశింపఁజేయుచుండెను. షాబాజుఖానునకు భీతి గలిగెను. "అయ్యో! ఈ ప్రతాపుఁడు కనిపింపఁడే, కనిపించి నను దొరకఁడే. ఇంక నేనేమి చేయుదు"నని వెనుకమొగమై పాఱిపోయెను.

ఆ మఱునాఁడు కాశీంఖాను సేనలతో వచ్చిన సడి యెఱిఁగి ప్రతాపుఁడు పోయి కలఁతపెట్టసాఁగెను. రాణా యడవి మృగమువలెఁ బోరాడుట వారి కాశ్చర్యము గలిగించెను. పులి గుహలోనికి రాలేక రాలేక వచ్చు జింకలవలె యవనసేనలు వచ్చుచుండఁ బ్రతాపుఁడు పరిమార్చుచుండెను. సగము సేనలు ప్రతాపుని వెన్నాడుచుండ, మిగిలిన సగముసైన్యము రాణిని జెఱబట్టుటకై బోయపాళెమువద్దఁ దారాడుచుండిరి. కొండల నడుమనున్న తగరపు గనులలో రాణా కుటుంబమును భిల్ల నాయకుఁడు సురక్షితముగఁ జూచుచుండెను.

ఒకనాఁటి యుద్ధమున భిల్లభటుఁ డొకఁడు రాణిగారి కడకువచ్చి సాగిలబడి నిలచెను. ఆమె వానినిజూచి "నాయనా! రాణాగారు సుఖముగ నున్నారా! వా

రెన్నఁడేని భార్యాపుత్రులను దలఁచుచుందురా! ఈ యమర సింహుఁడు తండ్రికడకేగి యుద్ధమొనర్తునని పోరుపెట్టు చున్నాఁడు. ఈ పసికూనలు యవనులఁ జించి, చెండాడ నుత్సాహము చూపుచున్నారు. వీరి నాపలేక యున్నాను. ఒకమాఱు వచ్చి చూచి పోవలసినదని తెలుపవలె"నని చెప్పి పంపెను. అట్లే ప్రతాపుఁడు వచ్చెను.

ఒకనాఁడు రాణా కుటుంబముతో సేనలతోఁ గొండల చెంతఁ దిరుగుచుండెను. దూరమున వచ్చుచున్న యవన సేనలఁజూచి, రాణా సైన్యముతోఁబోయి వారిని సంహరించి సాయంకాలమున నొక మఱ్ఱిచెట్టుక్రిందఁ జేరెను.

ఆ రాత్రి మబ్బులుపట్టి వాన కురియసాగెను. క్రమముగా గాలి తోడుపడెను. ఆ గాలివానకు తాము తలదాఁచుకొనిన చెట్టు తమపైఁ బడునేమోయని భయమున నా రాత్రి గడపిరి. పిల్ల లాఁకలిబాధకు డస్సి నిదురించిరి. బిడ్డలను దగ్గఱఁ జేర్చుకొని నెలలకూన నొడినుంచుకొని పాటేశ్వరి కన్నుమూయక యా రాత్రి గడపెను. ఇంతలో తెల్లవాఱినది. భిల్లుఁడు తెచ్చిన గడ్డిని రుబ్బి రాణి రొట్టెలను గాల్చుచుండెను. ఇంతలో కాళింఖాను కనుపించెను. పరివారముతో రాణా యావలి గుహలోనికిఁ బోవ, నచట మహబత్ ఖాన్ కనుపించెను. రాణా కొండకొనఁ జేరెను. అచటకు షాబాజుఖాన్ వచ్చెను. రాణా లోయలోని కేగ ఫరీదుఖాన్ కనుపించెను. ప్రతాపుఁడు కొండదాఁటిపోవ నబ్దుల్లా వెంబడించెను. రాణా చివరకు "నాబూ" కొండలదండ కరిగెను.

ఉదయపురమున కుత్తరదిక్కున రెండుక్రోసుల దూర ములోఁ ద్రికూట పర్వతము గలదు. ఆ ప్రాంతముననందే కళిం గేశ్వరాలయము గలదు. అచటికేగి ప్రతాపుఁడు స్వామిని దర్శించి గర్భాలయమునఁ గూర్చుండి యనుచరులతో - "సోదరులారా! వేయేండ్లనుండి విమవక వచ్చు యవనసేనా సముద్రములకుఁ జెలియలికట్టయై మేవాడరాజ్యలక్ష్మి స్థిర ముగా నిల్చినది. మన పూర్వులు ప్రాణముల నర్పించి స్వాతంత్ర్యమును నిలువఁబెట్టికొనిరి. ఆకాశమునంటు కోట లతో, నెనుబదినాలుగు విపణిమార్గములతో, పెక్కువేల రసపుత్రులతో నిండి యవనులకు గుండెగాలమైన చిత్తూరును బోలు పట్టణము గలదా?

"చిత్తూరులక్ష్మి సౌభాగ్యమాఱిపోయెను. ఈయిరువది యైదేండ్లనుండినిద్రాహారములమాని పోరాడుచున్నను గెలుపు గలుగలేదు. నా యాశ లెండమావులవలె గాలిమేడ లయి నవి. సిరిసంపదల కాలవాలములగు పదివేల గ్రామములు పాడువడి పోయినవి. ముప్పదాఱు రాజవంశములవారు పగ వారి నాశ్రయించిరి. దేశముపోయి కోశములేక సైన్యము నశించి శక్తి నమసియల్లాడుచున్నాను. రాజభోగములు పొంద వలసిన మనము కటకటెండలు గాయు వేళలలో సుడిగాలివీచు సమయములలోఁ దలదాఁచుకొననీడ లేక కష్టపడవలసివచ్చెను.

"అక్బరుతో రణమారంభించిన యీ పందొమ్మిదేండ్ల నుండియీకొండలలో దినమెల్ల గడ్డిరొట్టెలఁదిని గుక్కెఁడునీరు త్రాగి బ్రతుకుచుంటిమే! ఇఁక నెంతకాల మిట్లు బ్రతుకఁ

గలము? అక్బరు రాజ్యమేలుచుండ దరిద్రదేవత నిలువఁ దావులేక మనల నాశ్రయించినది. ముదిమియు నన్నలముకొన్నది. ధైర్యము సన్నగిల్లినది. ఉత్సాహ ముడిగినది. ఈ కష్టములలో నా శరీరమునఁ బ్రాణము లుండునో యుండవో! గెలుపు గలుగు సూచనలైనను గానరాకున్నవి. ఏ భగీరథుఁ డీగంగను సాధింపఁగలఁడో! 'మూలిగెడి నక్కపైఁ దాటిపండు పడి'నట్లు బలముడిగిన నాకీ ముదుసలితనము దాపురించినది. సర్వస్వము పరిత్యజించి సేవించుచున్న మీకు కీర్తి లవమేనియు లభింపలేదు గదా!

"కష్టములకుఁ జిక్కి కంపలలోఁబడిన కాకులవలె ముందు కేగలేక త్రోవలో నేడ్చుచున్నాము. వంశకీర్తిని నిలుపలేని నాకీదేశమున నిలచు నర్హతలేదు. మా పూర్వులు యజ్ఞములుచేసిన పవిత్రదేశములో గోహింసలు చూడలేకున్నాము. ఉత్తరాయణ పుణ్యకాలమువఱకు నంపశయ్యపైఁ బరుండిన భీష్మునివలె మేవాడ దేశమాత కన్నులలోఁ బ్రాణముంచుకొని యున్నది. నావెంట మీరు రాఁదలఁచినచో రండు. పర్షియాలోఁగాని, పంజాబులోఁగాని స్వతంత్ర రాజ్యము స్థాపించెద"ననినఁ గృష్ణసింహుఁడు లేచి "దేవా! దేశదాస్య నిర్మూలనమునకై చేయవలసిన దంతయుఁ జేసితిమి. తిండిలేక తపించుచున్నను విధిని ధిక్కరించి పోరు నీ తాలిమి యెవరికున్నది? పదుమూఁడేండ్లు వనవాస మొనరించిన పాండవులు, పదునాలుగేండ్లు వనవాస మొనరించిన రాముఁడు నీవు పడినపాటులు పడిరా? వైరిమధ్యమునఁ బోరుచుఁ జెట్టుకొమ్మల వంచి బుట్టలలోఁ గుటుంబమును బెట్టి

కాపాడితివి. గంపంత బలఁగముండియు నక్బరు నిన్ను గెలువ లేక తన్నుఁగొని చచ్చుచున్నాఁడు.

"ప్రపంచ ముదయించినది మొదలు కష్టములకు జడియక స్వాతంత్ర్యము నుపాసించిన నీయట్టి వీరుఁడున్నాఁడా! అక్బరు సేవ ధనసేవ. నీయది దైవసేవ. ఆత్మవైభవము నీది. ఐహికభోగము లతనివి. అతఁడు లోకమును గెలువ, నీవు నిన్నే గెలిచితివి. అపజయములే మనకు బలవర్ధకములు.

"శక్తి వంచన లేక మీ యడుగు లాశ్రయించి కొలుచుచున్నాము. మా సర్వస్వము నీయది. మే మెల్లరము నీయానఁ దలఁదాల్చి మాన్నాళ్లలో సర్వసన్నాహములతో వత్తు"మని పలికెను.

# 9. మిత్ర సమావేశము

అనుకొనిన రీతిగా మూన్నాళ్లకు సామంతులందఱు వస్తువాహనాదులతోఁ, గుటుంబములతోఁ బ్రతాపు నొద్దకు వచ్చిరి. అందఱు గుఱ్ఱముల నెక్కి ప్రయాణమునకు సిద్ధమై యుండిరి. రాణా వచ్చి, దేశము నలువైపులఁ గలయఁ జూచెను. మాతృభూమిని విడనాడవలసెను గదా యని, యతని కన్నులలో నీరు తిరుగుచుండెను. ప్రతాపుఁడు చేతులు జోడించి, డగ్గుత్తికతో—"తల్లీ! మేవాడ రాజ్యలక్ష్మీ! చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థమై పోయినవి. దైవము చిన్నచూపు చూచుటచే. నేను నీ పాదముల సేవింపఁజాలక వలసపోవుచున్నాను. నన్ను మన్నింపుము. ఇరువైయేండ్లుగ నేను కన్నకలలు గాలిమేడలై పోయినవి. దేశమునందు దాస్యాంధకార మలముకొన్నది. భౌతిక సుఖముల విసర్జించి, రక్త మాంసములర్పించి, మేవాడ తల్లికి రత్న కిరీటముఁ గూర్పఁదలఁచితిని. కాని, నా పాపహస్తముల కాయదృష్టము గలుగలేదు. నా బ్రతుకు వ్యర్థమైపోయినది.

"పసితనమందు లేడివలె గంతులు వైచిన తావులు, కొండలమీఁద కెగఁబ్రాఁకిన స్థానములు, పట్టాభిషిక్తుఁడనై ప్రాభవము నెఱపిన ప్రదేశములు, కవచఖడ్గములఁ దాల్చి వైరులను సంహరించిన చోటులు, నొంటివాఁడనై యపజయమునకు వెనుదీయక పోరాడిన స్థలములు, కట్టుబట్టలతోఁ, దినఁ దిండిలేక, నిన్ను సేవించిన ప్రాంతములు నన్ను

వదలిపెట్ట నున్నవి. బంధుమిత్రులు పలువురు చల్లనైన యీ నేలలో నూర్పువదలి యాచంద్రతారార్క కీర్తి గడింపఁ బిఱికివాఁడనై దొంగవలెఁ బాఱిపోవుచున్నాను. ఇంకొక వీరుఁడెవఁడైనను, జయించి, నిన్నుద్ధరింపఁబూని, స్వాతంత్ర్య యుద్ధమున విజయము నార్జించును గాక! పాఱుబోతులమగు మమ్ము మఱచి పోవుదువు గాక!'' యని చేతిగుడ్డలలో నచ్చటి మట్టిని దీసికొని, కండ్లకద్దుకొని, ప్రయాణము సాఁగించెను. అనుచరులెల్ల రతనివలెనే మట్టి కండ్లకద్దుకొని మూటలు గట్టుకొని సాగిపోవుచుండిరి. పుట్టిన గడ్డను వదల వలసి వచ్చెనను దిగులుతో వారు బరువెక్కిన గుండెలతో, వాయవ్య దిశ నేగుచుండిరి. మౌనముద్రలతోఁ గొండ పొలి మేఱలు దాఁటి పోఁజొచ్చిరి. వారికెదురుగా నొక వ్యక్తి వచ్చుచుండెను. అతఁడు ముక్కుతునుకవంటి గుఱ్ఱము నెక్కి యుండెను. ఆయన మొగము ముడుతలుపడి, ముదిమిని దెలుపుచున్నను, సత్వగుణము ప్రకాశించుచుండెను. వ్రాలిన కనుబొమ్మలనుండి యురుదెంచు చూపు లెదుటివారి హృదయ మునఁ జొచ్చుకొని పోవుచుండెను. ఆ శాంతమూర్తి తన కెదురుగా వచ్చుచున్న ప్రతాపునిఁ జూచి, "అయ్యా! నేను పరదేశిని. రాణాప్రతాపసింహుఁ డేకొండల నున్నాఁడో మీకుఁ దెలియునా? అచ్చటికి దారిఁ జూపింపవలయు"నని యడిగెను. పుట్టెఁడు చింతతోనున్న ప్రతాపుని కామాటలు వినిపించినను, మనస్సునఁ జొరనందున, వంచిన తల యెత్తక పోవుచుండెను. ఆ నూతన వ్యక్తి మరలఁ బలుకరించి "ఏమయ్యా! పిలచినను, బలుకక పోవుచున్నావే! ముదు

సలివాఁడను. దూరదేశమునుండి పెక్కు కష్టములకోర్చి వచ్చుచున్నాను. దయయుంచి ప్రతాపసింహుఁ డుండు కొండలకు దారిచూపి పుణ్యముఁగట్టుకొనుఁడు.'' అనెను.

ప్రతాపుఁడు :—(తలయెత్తి చూచి) అయ్యా! మీరెవరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు?

నూతన వ్యక్తి :—నాయనా! నే నీ దేశమువాఁడనే. వైశ్యుఁడను. వ్యాపారముకొఱకు పర్షాకేగితిని. నా పేరు భామాసాహి!

ప్రతాపుఁడు :—(గుఱ్ఱము దిగి) తండ్రీ! నీ పాదసేవకుఁడు ప్రతాపుఁడు నమస్కరించుచున్నాఁడు!

అని మ్రొక్కెను. అనుచరు లందఱుఁ దురగముల నుండి దిగిరి.

భామాసాహి :—(గుఱ్ఱము దిగి రాణాను కౌఁగలించుకొని) నాయనా! ఎన్నాళ్లకు నిన్ను జూడఁగలిగితిని! నాపాలి పారిజాతము, నా వజ్రకిరీటము, నా యిష్టదైవతము నేఁడు నా మ్రోలఁ బ్రత్యక్షమైనది. నేఁటికి నా జన్మతరించినది. నేను నీ సేవకుఁడను. నీయంతటి స్వాతంత్ర్యవీరుఁ డింకొకఁడు గలఁడా? నీ కీర్తి దిక్కుల నిండినది. నీ వెంత కళ గల తండ్రివి! నీ కనుఁగొనలు దివ్యకాంతులను జూచుచున్నవే! బుగ్గలవఱకు వ్యాపించిన నీ కోరమీసము రాచఠీవిని బ్రదర్శించుచున్నది. నీ నుదుటి కుంకుమబొట్టు, శరీరమందలి వజ్రకవచము, కేలఁగల నిలువెత్తు బల్లెము మనము నాకర్షించుచున్నవి. వైరులనే కాక నీలోని పగవారిని గెలిచితివి. ఇరువదేండ్లనుండి యేకదీక్షతో స్వాతంత్ర్య

సమరమును సాగించుచున్నావు. నిన్ను జూడవలయునని తలంచి తలంచి తీరుబడిలేక నేంటికి నిన్ను జూడంగలిగితిని. నీకు బ్రహ్మాయువగుం గాక!

ప్రతాపుండు :—తండ్రీ! దేవునివలె సమయమున కవతరించితివి. నిన్ను గాంచి నా జన్మతరించినది. చాణక్య యుగంధరాదులను మించి మా పూర్వులకు మంత్రివై ప్రజ్ఞా బలమున మేవాడకు వజ్రకవచముగూర్చిన నీకు నా జోహారులు! వైశ్యవంశము నీ వలనం బావనమైనది. భట్టి, మాఘుండు మొదలగు మహాపురుషులను గని తనిసిన వైశ్యమాత నీ వలన మఱియొక మాఱు పుత్రవతియైనది. మేవాడ దేశములోని మారుమూల పల్లెలసైత మర్ధరాత్రి వేళనైనను నీ పేరును వినినచో నాబాలగోపాలము భక్తితోం బులకరించి నమస్కారము చేయుచున్నారు. ఒకమాఱు పర్ష్యాకు వచ్చి నిన్ను సేవింపవలయునని యెన్నినాళ్ళ నుండియో తలంచి తలంచి యుంటిని. కాని, నిముసమైనను తీఱికలేని యుద్ధములలోం జిక్కి కాలు గదలింపం జాలకుంటిని.

భామాసాహి :—ప్రతాపా! నేను సైతము రావలయునని తలంచి వ్యాపారపు సందడిలో రా వీలులేక తుదకీ నాంటికి గట్టి పట్టుదలతో బయలుదేఱివచ్చి నేను సేవించిన నా పూర్వరాజుల తపస్సునకు మూలమైన నిన్నుం గాంచితిని. నాజన్మ ధన్యమైనది. నాయనా! ఎక్కడికి ప్రయాణము?

ప్రతాపుండు:—తండ్రీ! నిన్నాశ్రయించి నీ దయవలనం బంజాబున కావల స్వతంత్రరాజ్యము స్థాపించు నుద్దేశ్య

ముతో, ననుచరులతో బయలుదేఱి వచ్చుచుండ వెదుకఁ బోయిన తీవ కాళ్లకుఁ దగులుకొనినట్లు నేఁడు నీ దివ్యదర్శనమే మాకైనది. మేరువును బెళ్లగించి యుదయపుర రాజ్యలక్ష్మికి రత్నకిరీట మిడుదు నను నాశతో లోకముల నెదరించి యిరువదైదేండ్లు పోరితిని. నా యదృష్టము చెడినది. నేనేమియుఁ జేయలేని యభాగ్యుఁడనైతిని.

భామాసాహి :—(దిగులు చూపులతో) శ్రీహరీ! నా దురదృష్టము నేమనఁగలను! నీనోట నిట్టిమాట వినియు నా గుండె పగిలిపోకున్నదే! నా గుండె బండయో, వజ్రమో! మూరామడలనుండి వచ్చుచున్న నా యుత్సాహ మణఁగి పోయినది. నా ప్రాణము లున్నంతవఱకు మేవాడ రాజ్యలక్ష్మివై భవప్రాభవములకు మూలకారణమైన సూర్య వంశము పతనమగుచుండఁ జూచి యోర్వఁగలనా! బ్రహ్మదేవుని వ్రాఁతను సైతము నా ప్రజ్ఞాబలమునఁ దుడిచివేసెదను.

"నాయనా! ఉత్తమోత్తమ భారతీయుఁడవు. కష్టములు చుట్టుముట్టినను వెనుదీయని ధైర్యశాలి వని లోకములు నిన్ను గొనియాడుచున్నవే! నీవే యాత్మధర్మమును బరిత్యజించినచో లోకమున ధర్మమునకుఁ దావుగలదా? నీవు కర్మవీరుఁడవు. నీ గెలుపు లోకమునకే గెలుపు! నీ యపజయము ధర్మమున కపజయము. పెక్కువేలమైళ్లు దూరమందున్నను జల్లని నీ పరిపాలనను, నీ రణదీక్షను, నీ సాహసమును వీనుల విందుగ వినుచుంటిని.

"దేవా! మా పూర్వులెల్ల మీ తాతదండ్రులకడ మంత్రులైయుండిరి. చండమహారాజు కాలమునుండి నా

పూర్వులును మేమును మీ వారిని సేవించితిమి. నేను పర్షియా కేగిన యీ నలుబదేండ్లనుండి మేవాడరాజుల స్మరింపక నోటికి నన్నపుముద్ద నెత్తుకొని తినను. నా శరీరము, సంపదలు, సర్వస్వము మీయవి! నేను సేవించినట్టి రాజవంశమునం దిట్టి మహాపురుషుఁ డుదయించెనని సంతోషముతో మండు వేసవిలో కష్టములకోర్చి వచ్చి నిన్ను దర్శించితిని. నేను ముదుసలివాఁడను. మేవాడ భక్తుఁడను. నీకు మంత్రిని. మీ శ్రేయోభిలాషిని. నా హితమును విని నీకుఁ దోఁచిన రీతి నాచరింపుము.

"నాయనా! మేవాడ వదలి యింకేవాడలకైనఁ బో వగునా? పాదరసమువలెఁ బరిపరిగతులఁ బరువిడుటవలనఁ బ్రయోజనమేమి! పరిస్థితులను దలపోసి యాతురత వదలి శాంతముతో, ధైర్యముతో నిలువుము. నీ వెన్నిచోట్లఁ దిరిగినను, ఎక్కడకేగినను నీవు నీవే కాని వేఱొకఁడ వగుదువా? కార్యసాధకుఁ డైనవాఁడు కృషిని విడనాడఁ డగదు. కృషిని నిరసించువానికి లోకమునఁ జోటులేదు. అలజడి గలిగినప్పుడు సత్యము గెలుచును. అపజయములు సత్యమునకు బలమునిచ్చును. స్వాతంత్ర్యలబ్ధికి సత్యము, త్యాగము సహాయకములు. ఆపదలలో నీ వధీరుఁడవైనచో నీ కాత్మబలము చాలదని నానిర్ణయము.

"ప్రాణములకన్న మిన్నయగు మేవాడను విడచి పోఁగూడదని ముమ్మాఱులు నీకు నొక్కి చెప్పుచున్నాను. కాదు, కూడదని నీవు పోఁదలఁచినచో నా శక్తి యున్నంత వఱకు నిలువరించి తీసెదను."

ప్రతాపుఁడు :—(ఆనందబాష్పములతో) తండ్రీ! నీ వాత్సల్యము నేమని కొనియాడఁగలను! పరిమితశక్తిగల మానవుఁ డొకచోఁ గష్టముల కాగలేక ధర్మమార్గము వీడ నున్నప్పుడు భగవంతుఁడు మహాపురుషుల రూపమునవచ్చి ప్రబోధించి ధర్మభ్రష్టుని గానీకుండ కాపాడునను పెద్దల వాక్యము నా యెడ నీ నాఁడు నిజమైనది. నీవు దయయుంచి పురుషప్రయత్నము నాకు నేర్పించితివి. నీ యమూల్యహితము భగవంతుని ప్రసాదమువలెఁ దలఁదాల్తును. లోకమును సమ్మోహింపఁజేయు నీ యమృతవాక్యములు నా హృదయ వీణను మీటి నన్నులొంగఁజేసికొనినవి. నీ యిష్టము వచ్చిన రీతి నన్నాజ్ఞాపింపుము. నీ యానతి కడుగు దాఁట నేఱను.

భామాసాహి :—నాయనా! యిప్పుడు క్షణక్షణ మమూల్యమైనది. కాలము వ్యర్థమొనరింపరాదు. మనము చర్చించఁదగిన విషయము కొంచెమే. ఒక నిమిషము మాట లాడినఁ జాలును. ఆలసింపనేల? ఆ వేఁపచెట్టువద్దకు రమ్ము. ఆ! యింకొకటి మఱచితిని. కలఁడుగదా నీ మంత్రి కృష్ణ సింహుఁడు. అతనిని బిలువుము. అతఁ డనుభవజ్ఞుఁడు. అతఁడు లేని మంత్రాలోచన పూలు లేని పూజ.

రాణాప్రతాపుఁడు కృష్ణునివంకఁ జూచెను. కృష్ణుఁ డరుదెంచి ప్రదక్షిణము గావించి భామాసాహికి నమస్కరించి "దేవా! మీ పాదసేవకుఁడు కృష్ణసింహుఁడు నమస్కరించు చున్నాఁ" డని పలికెను. భామాసాహి యతనిని లేవఁ దీసెను. వారెల్లరు వేఁపచెట్టువద్దకు వచ్చిరి.

భామాసాహి :—(చిఱునవ్వు మోముతో) ప్రతాపా! సావధానముగా వినవలసినది. రాజు, మంత్రి, స్నేహితుఁడు, ధనము, సైన్యము, కోట, దేశ మని ప్రకృతు లేడు విధములు. ఇన్నింటిలో మనకున్న వానిని విచారింతము. ఉత్తమ కులీనుఁడవు, మహోదాత్త వర్తనుఁడవు నగు నీవు రాజుగాఁ దగియున్నావు. విశాల భావములుగలిగి యనుభవజ్ఞుఁడై స్వామిభక్తి గల సలుంబ్రాకృష్ణుఁడు మంత్రిపదవికిఁ దగియున్నాఁడు. విక్రమము, రాజభక్తి, యుత్సాహము గల భీమచాందు స్నేహమునకుఁ దగియున్నాఁడు. ప్రకృతులలో నెల్ల ప్రధానమైనది ధనము. ప్రపంచమున ధనమునకున్నంత ప్రాముఖ్యము మఱి దేనికిని లేదు. ధనమువలన సైన్యము, దుర్గము లభించును. నీకు మొదటినుండియు నీలోపమే కలదు. నీకుత్సాహశక్తి గలదు గాని మంత్రశక్తిలేదు. ప్రభుశక్తి యంతకన్న లేదు. ధైర్య మవలంబించి, జంకక, కొంకక, విసువక, కష్టముల లెక్కింపక ప్రపంచోన్నతుఁడగు విరోధితోఁ బ్రతిఘటించి యెన్నాళ్లు పోరు సాగించితివి! ధన, సైన్య, బలములు కొదువగా నెన్నాళ్లు పోరినను నేమి ప్రయోజనము! కాలమును వ్యర్థ మొనరింపకుము. నా మనవిని కాదనక వినుము. దేశసేవకై ధనము సమర్పింతును. దానిఁ గైకొని దేశకళ్యాణమునకుఁ గడంగుము.

ప్రతాపుఁడు :—దేవా! నీ యానతి శిరసావహింతును. జేనేఁడు రాజ్యముగాని, కాసంత ధనముగాని లేక, తొలుత నుండి దారిద్ర్య మనుభవించుటకై జన్మించిన యీ దరిద్ర నారాయణుని నన్ను ధనికు నొనరింపఁ బారిజాతమై తోఁచి

నన్నుద్ధరించితివి. మా పూర్వులెల్ల రాశ్రితులకు ధనధాన్య వస్తువాహనాదుల నొసఁగి సత్కరింప, నేను నీ కడనుండి ధనము గైకొనఁ దగునా?

భామాసాహి "నాయనా! మిమ్ము సేవించి యార్జించిన ధనమును సమయము వచ్చినపుడు దేశసేవకై మీ కర్పించుటయే నాకు భాగ్యము. నా మాతృదేశమునకై వినియోగింపఁబడని సిరిసంపదలు వ్యర్థములు. ఆలసింపక బోయపాళెమునకు ధనము నంపుదును. మీరు వెంటనే పోయి భీమచాందుతోఁ గూడి సేనల వృద్ధిచేసికొనుఁడు. నాకుఁ దీటికలే"దని పలికి యచ్చటివారిని గలయఁగాంచి, "నాయనలారా! చిత్తూరు, ఉదయపుర దుర్గములపై యవనుల జండా యెగురుచుండ మీరు నిర్వీర్యులై చూచుచున్నారా! ఈ హారావళీ పర్వతప్రాంతములందు నిరువదేండ్లనుండి పోరిపోరి యీనాఁడు కడుపుకూటికి వంశ ప్రతిష్ఠఁ జెఱచి పాఱిపోవుచున్నారా! ప్రతాప కృష్ణసింహుల ప్రాణములుండఁగనే పాఱిపోయెదరా! అపజయముల కోర్చి పడరాని పాట్లు పడి నిష్కారణముగ నేఁడు స్వాతంత్ర్య మార్గమును విడువఁదగునే! దేశమును గో, స్త్రీ వధలకై పగవారి కప్పగించుచున్నారా! కొండ గుహాలకేగిన చావు దప్పునా! లెండు, బలములఁ గూర్చుకొనుఁడు. వైరులను గెలిచి కీర్తి ప్రతిష్ఠల నార్జింపుఁడు." అని ప్రబోధించి తురగము నెక్కి మరలిపోసాగెను. ప్రతాపు ననుచరులు భామాసాహి యాజ్ఞలను శిరసావహించిరి.

# 10. దిగ్విజయ యాత్ర

ప్రతాపుఁ డనుచరులతో వెనుఁదిరిగిపోయి బోయ పాళెమున కర్ధరాత్రమునకుఁ జేరి, పాళెము వెలుపలనిలచి శంఖమూఁదెను. భీమచాందు ప్రతాపుని శంఖధ్వానమును విని యాశ్చర్యపడుచు నరుదెంచెను. భిల్లులెల్లరు బిలబిల మూఁగిరి. అతిథులకు సాత్వికాహారములతో భిల్లు లాతిథ్య మొసఁగిరి. తెల్లవాఱఁగనే సామంతులు, కృష్ణసింహుఁడు రాణా సెలవు పుచ్చుకొని సైన్యసన్నాహము లొనరించుకొని రాఁ దమ తమ దేశముల కరిగిరి. "రాణాగారు భామాసాహి యను తన పూర్వ వైశ్యమంత్రివలన ధనమార్జించి, దిగ్విజయ మొనరింపనున్నాఁడు. దేశమాత ఋణముఁ దీర్పఁదలఁచు యువకులు సేనలోఁ జేరి స్వాతంత్ర్యము నార్జింప బోయ పాళెమునకు రం"డని ప్రతాపు ననుచరులు దేశ దేశములలోఁ జాటి చెప్పుచుండిరి.

పిదపఁ గొన్నాళ్లకుఁ బ్రతాపు ననుచరులు సూక్త కృష్ణసింహాదులు సేనలతోఁ జనుదెంచిరి. ఒకనాఁ డొక సేవకుఁడు వచ్చి రాణాను జూచి "దేవా! భామాసాహి పంపిన బండ్లు వచ్చి నిలచియున్నవి. చూడరం"డని పిలచెను. భీమచాందుతోడఁ బోయి రాణాగారు కొండ ప్రక్కన మూఁడు క్రోసుల పొడవున నిలిచిన బండ్లను జూచి, నెలకుఁ బదునైదు రూప్యముల వంతున నిరువదియైదు వేల సైనికులకుఁ బండ్రెండేండ్లవఱకు జీతమిచ్చుటకుఁ దగిన ధనము భామా సాహి పంపినాఁడని లెక్కవైచిరి.

"అదిగో! ఇంద్ర ధనుపు కనిపించుచున్నది. ఇది యుద్ధము

నకు మంచి సమయ''మని, భీమచాందు పలికి రణసన్నాహము లొనరింపసాగెను. మహారాణా తన బిడ్డలను చిఱునవ్వుతో దగ్గఱకుఁ దీసికొని, యెత్తుకొని ముద్దులాడుచుండఁ బాటేశ్వరీదేవి నవ్వుమొగముతో మగనిని జేరి, "దేవా! మీ మోమునఁ జిఱునవ్వు వెన్నెలలు తురంగలించుచున్నవి. సైన్యములు సన్నాహపడుచున్నవి. విజయలక్ష్మీసమేతులై తిరిగిరం''డని పలుకఁ బ్రతాపుఁడు పత్నిని జూచి "దేవీ! ముష్కర తురుష్కులఁ జెండి, స్వాతంత్ర్యము నార్జింప వెడలుచున్నాము. నెల కొకసారి వచ్చి పోవుచుందును. భీమచాందు నాతో రాఁగలఁడు. సన్నాశీర్వదించి పంపు'' మని పలికెను. పాటేశ్వరి భర్తను జూచి "దేవా! ఇంతకన్న నాకుఁ గోరఁదగిన దేమి కలదు? మీ మనస్సునందు నాకుఁగాని బిడ్డలకుఁగాని తావీయక, దృఢసంకల్పముతో మేవాడలక్ష్మికి మణికిరీటముఁ గూర్చుఁ''డని పలికి పళ్లెరములో నవరత్నము లుంచి రత్నదీధితులతో నివాళి యొసఁగి నమస్కరించెను. అమరసింహునకు వీరతిలకము దిద్ది, వీరగంధ మలఁది, దీవించి సాగనంపెను. భిల్లులు జయజయధ్వను లొనరింప, భిల్లాంగనలు పాటలఁ బాడుచు సేనలపై, రాణాపై, సామంతులపైఁ బూలవానలు కురియించిరి.

ప్రతాపుఁడు దేవేరీదుర్గము నర్ధరాత్రికిఁ జేరెను. కోట తలుపులు బారులుగాఁ దెఱచియుంచఁబడెను. మొగలు సైనికులు గుండెలపైఁ జేయివైచుకొని నిశ్చింతగాఁ బరుండియుండిరి. కోట తలుపులు తెఱచియుండుటఁ జూచి, వడివడి

లోని కేగఁబోవు సైనికులను నిలిపి ప్రతాపుఁడు "నాయనలారా! మన పగవారలిపుడు డొడలుమఱచి నిద్రించుచున్నారు. అట్టిచో వారిఁ జంపుట క్షాత్రధర్మముగాదు. మన పూర్వులు పెక్కువేలేండ్లు దొరతనముతోఁ బాలించిన యీ దుర్గములోనికి మనము దొంగలవలె నర్ధరాత్రి వేళలో నరుగుట తగదు. పౌరుషముఁ జూపి, వీరిని మేల్కొలిపి, చించి చెండాడుఁ" డని పలికి తన శంఖము నూఁదెను. పిదప ననుచరులుఁ దమ తమ శంఖము లూఁద, భీమచాందు బూర నూఁదెను. తొలుత నమరసింహుఁడు గుఱ్ఱమును దుర్గములోనికి దుమికించెను. కృష్ణసింహ ప్రతాపసింహులు లోనికిఁ జొచ్చిరి. భీమచాందు, తక్కుఁగల సామంతులు, సేనలు, కోలాహల మొనరించుచు దుర్గములోని కేగిరి.

దేవేరీ దుర్గాధిపతి షాబాజుఖాను పదివేల రసపుత్రుల సింహనాదములను, శంఖముల మ్రోఁతలనువిని తత్తరపాటుతో నిదుర లేచి సన్నాహము లొనరింపసాగెను. కోటలోని యవనులు కల్లుమత్తుతో, తూగు కండ్లతో, కత్తికటారులకొఱకు వెదకుచుండు నంతలోనే కాలయమునివలె రాణా ప్రత్యక్షమాయెను. మహమ్మదీయులు దిగులుమొగములతో నలువంకలఁ గలయఁజూచునప్పటికి కేవంకఁజూచినను రాజపుత్రులు సింగములవలెఁ గనిపించిరి. పోవుటకు వీలుదొరకక యవనులు ప్రాణములకుఁ దెగించి పోరఁదొడఁగిరి. కారుచీకట్లు క్రమ్మిన యా కాళరాత్రిలో నలఁతి వెడల్పు గల యా దుర్గములో ముప్పదివేల భటులు పోరుచుండిరి. యవనులు దిక్కు తెలియక రసపుత్రులని తలఁచి తమవారిని తామే చంపుకొనుచుండిరి.

ఇంతలో భిల్లులు కట్టుదిట్టములవెలిఁగించి కొంత విదయ్యముల గుర్తు నకుఁ దెచ్చిరి. అమరసింహుఁ డంటరాని మంటవలెఁ బగవారిని బీనుఁగుపెంటలఁ గావించుచుండెను. ఎక్కడఁజూచిన నమర సింహుఁడు శత్రుమధ్యమున దుమికి తలలు దటిఁగిపోయు చుండెను. ఒకచేతఁ గత్తిని, మఱియొక చేత సూర్యధ్వజమును దాల్చి రాణా పగవారి సేనలను జంపుచుండెను. ప్రతాపుని సామంతు లరిభయంకరులై పరాక్రమించుచుండిరి. షాబాజు ఖాన్ గోఁజుచుఁ దక్షకునివలెఁ బోరుచుండ గరుత్మంతునివలె రాణా యవనుల నూడ్చివైచుచుండెను. అంతలో సూర్యుఁ డుదయగిరిపయిఁ గన్పించెను. తన కులస్వామి నారా ధించి ప్రతాపుఁడు దుర్గ మాక్రమించెను. ఈ విషయమును దేవేరికిఁ దెలియఁజెప్పుటకొరకు భిల్లునిఁ బంపి, సేనలను జూచి, "యీ చిల్లర కోటలు మనకు ముఖ్యములు కావు. మన కుంభ రాణా యేలిన కుంభల్ మియర్ దుర్గమును గెలిచెదువఱకు నాహారము గైకొన"నెను. హారావళి కొండలరాజు శిర మందు రత్నకిరీటమువలె కుంభల్ మియర్ దుర్గమును బ్రతా పుఁడు గాంచి "తల్లీ! పదునాలుగేండ్లకు సెలవుగా నేఁటికి మరల నిన్ను జూడఁగలిగితిని. ఈనాఁడు నీ ఋణము దీర్చెద" నని పలికి దుర్గద్వారముఁజేరి శంఖ మూఁదెను.

కోటలోనున్న యబ్దుల్లాఖాన్ యవనసేనలతో మార్కొనెను. నలువైపులఁ జుట్టుముట్టిన రాజపుత్రులఁజూచి యవనులు నిర్వీరపోయి చావునకుఁ దెగించి పోరఁదొడఁగిరి. నలుంబ్రా కృష్ణుని కత్తి యగ్నిజ్వాలవలె శాత్రవారణ్యము

లను నీరు సేయుచుండెను. కత్తులు తళతళ మెఱయుచుండెను. బాణవర్షములు గురియుచుండ రణభూమి వర్షఋతువును బోలియుండెను. యవనుల యార్తనాదములతో, రాజపుత్రుల సింహగర్జనలతో దిక్కులుపిక్కటిల్లి మాఱుమ్రోఁగుచుండెను.

ఇంతలో నడగొండవలె నేనుఁగునెక్కి వచ్చు నబ్దుల్లా ఖాను నొక్క వ్రేటునఁ బ్రతాపుఁడు తెగటార్చెను. అతని యేనుఁగు పీనుఁగాయెను. అబ్దుల్లాతల యెగిరిపడుటఁజూచి సైనికులు పాఱిపోయిరి. దుర్గము ప్రతాపుని స్వాధీనమాయెను.

ఇంగ్లాండునుండి ఢిల్లీకి వచ్చు వస్తువులు సూరత్ రేవునుండి యీశాన్యముగఁ బోయిపోయి కుంభల్ మియర్ కోట ప్రక్కనుండి ఢిల్లీ జేరఁబోవుట యాచారముగా సాగుచుండెను. ఆ త్రోవనఁబోవు బండ్లవారి ననుదినము కొల్లగొట్టి రాజపుత్రులు దోచుకొనిన వస్తువులతోఁ గోట నిండిపోయెను. చైత్రయాత్రనొనర్చి రాణా ముప్పది రెండు కోటల స్వాధీనపఱచుకొనెను. రాణావిజయగాథలు కోటలు, పేటలు, వాడలుఁదాఁటి మెల్లమెల్లగ ఢిల్లీ జేరి యక్బరు చెవికి శూలములవలెఁ దాఁకెను.

# 11. అవసర సమావేశము

రాణా దిగ్విజయయాత్ర యక్బరునకుఁ గర్ణకఠోరములు గాఁగ, నతఁడు పిచ్చిపట్టినవానివలె నేమి చేయుటకుఁ దోఁచక, యాప్తులఁ బిలువ నంపి, యవసరసమావేశ మేర్పఱచెను. ప్రముఖసేనానులు, మంత్రులు సభ కరుదెంచిరి.

అక్బరు :—(విషాదముతో) వింటిరా! ప్రతాపుని విజృంభణము? దేవేరీదుర్గములో షాబాజుఖానుని జీల్చెనఁట! అబ్దుల్లాను జంపి, కుంభల్మియరు కోటఁ గైకొనెనఁట! మహాబత్ ఖానుని సంహరించి, సూర్యమహాలుదుర్గమును గెలిచెను. అణఁగి, వెనుకకుఁబోయిన ప్రతాపసముద్ర మల్ల కల్లోలములతో నుప్పొంగి ముంచుకొని వచ్చుచున్నది! ఇఁక నేమి చేయఁగలను! మేవాడ నెట్లు నిలుపుకొనఁగలను?

హరివిజయసూరి :—దేవా! ఓడిపోయిన ప్రతాపున కింతటి బల మెట్లు వచ్చినదో! ఇది యాశ్చర్యముగా నున్నదే!

అక్బరు :—'భామాసాహి' యను వైశ్యుఁ డొకఁడు ప్రతాపుని పూర్వులకు మంత్రిగానుండి, కారణాంతరములచే పరిషియా కేగి, వ్యాపార మొనరించి, కోట్లకొలఁది ధన మార్జించెనఁట! నాతోఁ బోర లేక దూర దేశముల కేగుచున్న ప్రతాపునిఁ జూచుటకు నా భామాసాహి వచ్చి, యతనికి రాజనీతిఁ గఱపి, వేయిబండ్ల నిండుగ ధనమిచ్చినాఁడఁట. ఆ ధనముతో రాణా సైన్యములఁ గూర్చుకొని, యీ మహాయుద్ధ మారంభించెనని నిన్న వేగులవాండ్రు నాకుఁ జెప్పిరి.

జైనగురువు :—ఆహా! భామాసాహిత్యాగ మమాను షము. ఆ పుణ్యాత్ముఁడు దేశకాలపాత్రము లాలోచించి

చేసిన యీ దాన మతని పేరును శాశ్వతము గావింపఁగలదు. వైశ్యవంశ మాతని జన్మవలన పునీతమైనది. నేనొక మాఱు జైనమత గురువగు మేరుతుంగాచార్యులు రచించిన 'ప్రబంధ చింతామణి' లో వైశ్యవంశీయుఁ డగు 'మాఘమహాకవి' జీవితముఁ జదివితిని. ఆ మహామహుఁడు మేరుపర్వతమువంటి సంపదను యాచకులకు దానమొనర్చి, పేదవడి, పిదప యాచకుల కొసఁగుట కొక కాసైన లేదని విచారించుచుఁ బరమపదించెను. నేఁటి కీ భామాసాహిత్యాగము మాఘుని వితీర్ణిని గుర్తునకుఁ దెచ్చుచున్నది.

అక్బరు :—(చీకాకుతో)మీ కేల యీ పిచ్చి! భామాసాహి పుణ్యాత్ముఁడగునా, కాఁడా యని మన కేమైన సందేహము గలిగినదా? ఎందుల కీ పనికిమాలిన చర్చలు? ఇన్నాళ్లనుండి నా మనస్సులోఁ బ్రతాపునినోట ''శరణ'' నిపింతుమను నాస కొండంతలుగ నుండెను. ఛీ! ఎందు కీ బ్రతుకు! రాజ్యము లేక, సైన్యములేక యసహాయుఁడైన రాణా మనవారలఁ గుక్కలవలెఁ దఱిమెను. నేఁ డతనికి నింద్రభోగము లున్నవి; గంపెఁడంత బలఁగమున్నది. ఇఁక లోకమును గాల్చి వేయుటలో నాశ్చర్యమున్నదా?

అని యక్బరు పాదుషా విచారించుచుండఁ గొలువు కూటము వెలవెలఁబోవుచుండెను.

మానసింహుఁడు :—దేవా! నీ వేల విచారింతువు? నిమిషములోఁ గాశ్మీర, గాంధార దేశముల జయించితిని గదా! నా శక్తియుక్తులు నీకుఁ దెలియవా? నేను తలఁచినచో రాణా నిలువఁగలఁడా?

అక్బరు :—(రాజులవంకఁ జూచుచు) ఈ యడియాస లతో నింకెన్నాళ్లు గడుపుమందువు? నాకుఁ గలిగిన నష్ట మపారము. నా యాశాలతలు మొదలంటఁ ద్రెంపివేయఁబడి నవి. నాకు విషాదగీతికలు మిగిలినవి. ప్రతాపుఁడీ దేశమును వదలి పోవుచున్నాఁడని విని, నీగతి నీది, నాగతి నాది యని సంతసించితిని. మాయదారికోమటి మంత్రాంగము నా కొంపఁ గూల్చినది.

అబ్దుర్ రహిమాన్ :—మహారాజా! ఏల విచారము! ఆ రాణా ప్రతాపసింహుఁడు రాజాధిరాజులు కొలువఁదగిన వాఁడు. త్యాగమూర్తి. నీవైయేగి రాజ్యమునంతయు నిచ్చితినన్నను నాసింపఁడు. అట్టివాఁడే కులమందైన నుదయించెనా! చైతకాశ్వము నెక్కి, వజ్రకవచముఁ దొడిగి, కోరమీసముఁ ద్రిప్పుకొని కేలఁ బల్లెముఁ దాల్చివచ్చు నతని ఠీవిని జూచుటకుఁ బదివేల కన్నులైనను జాలవు. అయిన నొక్కమాటకు బదులుచెప్పుము. అతఁడు నీ కేల లొంగ వలయును? ఆతని కీర్తి వెన్నెలలో మనుచు సమకాలీనుల మని చెప్పుకొను నదృష్టము మనకుఁ జాలును. ఆయన క్షేమమే మనకు, మన రాజ్యమునకు శ్రీరామరక్ష.

"నీవు నీ రాజధానిలో సుఖముగ నుండఁగా, దట్ట మగు మబ్బులలమిన యొక రాత్రివేళ నొంటరిగ రాణాగారు నీ పడకగదిలోఁ గనిపించిన నీ వెదిరించి పోరాడఁగలవా! ఏమయిన నేమి! నేనుమాత్రము ప్రతాపున కెట్టి యుపకార మైనఁ గలిగించువారిని జూచి సహించలేను.

"ఒక టంకశాలలోని వెవ్వేఱు నాణెములవలె, ఒక రాజు పాలించు రాజ్యములో మతములు కలిసిమెలిసి యుండవలయును. అన్నిమతములు ముక్తికి రాచబాటలే! ప్రతాపుని మత ముత్తమోత్తమమైనది. అయ్యయ్యో! ఆ ప్రతాపుఁడొకవిధముగ నీకు లోఁబడువాఁడు కాఁడు. నీవా లోకమును బ్రతుకనీయవు. రాజపుత్రుల పౌరుషములు సామాన్యములుగావు. అతని కపచారముచేసిన భూదేవి సహింపదు. నాలుగేండ్లవాని నన్ను బెంచి పెద్దచేసితివి. నా శరీరమందలి ప్రతినెత్తురుచుక్క నిన్ను గలవరించుచున్నది. నీ క్షేమము నా కాంక్షించి నాకుఁ దోఁచినయట్లు చెప్పితి"నని విన్నవించెను.

అబ్దుర్ రహీమాన్ వాక్యములకు హరివిజయసూరి, సూరిదాసు, ఫెరిస్తా మనీషి తమ యంగీకారముల వెల్లడించిరి.

మానసింహుఁడు :—(సభ కలయఁజూచి) ఆ ప్రతాపుని భట్రాజువలెఁ బొగడుచున్నారు. ఇదిగో నా ప్రతిజ్ఞ! ఇందున్న మంత్రులు, సామంతులు నాతనివైపుఁ జేరి వచ్చినను డీకొనఁగలను. ప్రాణములకైనఁ దెగింతును సుమా!

పృథ్వీరాజు :—(మానసింహుని చుఱచుఱ జూచుచు) ఏమయ్యా! ఏమో కొమ్ములు మొలచినవానివలె మాట్లాడుచున్నావు. అతఁడు పూజార్హుఁడు. మన కెంత బలమున్నను రాఁబోవు చరిత్రకారులు మనలను దేశద్రోహులుగా లెక్కచేయుదురు.

"బ్రతికినన్నాళ్లు డంబములు కొట్టుకొనుచు బ్రతికితివి. ఇంకను పురులుపెట్టి పోరు సాగింపఁజూతువేల! సంద్రమం

దెన్ని వస్తువులు పుట్టినను నొక చంద్రదర్శనమువలననే యది పొంగును. అట్లే రాజపుత్రవంశము ప్రతాపునివలనఁ దేజః పావిత్ర్యముల నొందినది. అట్టి కులదీపకునిపైఁ గత్తి నెత్తిన వానికి నరకము తప్ప''దనిన పృథ్వీరాజు మాటలీటెపోటులవలె నాటఁ, దోఁకఁద్రొక్కిన పామువలె మానసింహుఁడు రోఁజుచు దుముకఁబోవఁ బాదుషా యాతని నిలిపి యిట్లు పలుకఁ దొడంగెను :

''మీ రెల్లరు మీ హృదయ భావముల విప్పి చెప్పుటకే యీ సభ నింతవఱకు సాగించితిని. ప్రతాపునిపై నా కించుకేని యీర్ష్య లేదు. ఎన్నివిధముల నాలోచించినను బ్రతాపుఁడు నావంటి పదివేల పాదుషాలు గొలువఁదగినవాఁడు. ఈ మహారాజున కొనర్చిన యపచారములఁ దలఁచుకొనిన నాతని దర్శించుకొన జంకగుచున్నది. నా జీవిత శేషమెల్ల నాతని కంకిత మొనర్చినను నాతని ఋణము దీఱదు. అతని దేశ మాతఁ డేలుకొనుటయే ధర్మము.

''నాకా, యేఁబదియేండ్లు నిండినవి. ముదుసలినైతిని. పసివాండ్రగు నిద్దఱు బిడ్డలను నా కండ్లయెదుటనే పోఁగొట్టుకొంటిని. యువరాజు సలీము త్రాగుఁబోతైనాఁడు. నలుబదేండ్లనుండి యుద్ధముతోఁ గాలము గడపితిని. ఇఁక జీవిత శేషము సుఖముగఁ బ్రొద్దులు పుత్తును.

మానసింహుఁడు :—దేవా! నీ మాటలు విన లేను. పూలతోఁటవంటి నీ రాజ్యమున ముండ్లపొదవలెఁ బ్రతాపుఁ డుండఁగఁ జూచి యోర్వఁగలనే?

అని రోఁజుచు, తన చేతియందలి కత్తిని దూరముగఁ బాఱవైచెను. సభయం దెల్లెడ నిశ్శబ్ద మావరించెను.

అక్బరు :—(మానసింహునిఁ జూచుచు) మన యబ్దుర్ రహిమాను శీలము జగన్మాన్యము. అతఁడు స్వచ్ఛంద వర్తనుఁడు. నా శ్రేయమును గోరు నీతని హితోక్తులు వినఁదగి యున్నవి. నీ కీ పృథ్వీరాజు గౌరవనీయుఁడు. ఆ ప్రతాపుని తమ్ముఁన కల్లుఁడు. ఇదిగో! నా నిశ్చయము వినుము! మేవాడ వదలి సేనలతో రావలసినదని మన సేనానులకు నా యాజ్ఞగా ఫర్మానాలఁ బంపించుఁడు.

అని గంభీరముగఁ బల్కి యక్బ రంతఃపురమున కేగెను.

# 12. స్వాతంత్ర్యోత్సవము

నెల దాటకముందే యక్బరునాజ్ఞల శిరసావహించి యవనసేనానులు గుడారము లూడఁబెఱికి మేవాడను, హారావళీపర్వత ప్రాంతములను వదలి మొగములు వాల్చుకొని, ఢిల్లీకిఁ దఱలిపోయిరి. హారావళీ పర్వతప్రాంతములం దంతట రాజపుత్రులు, భిల్లులు వ్యాపించిరి. ఒక్క చిత్తూరు దుర్గము దక్క మిగిలిన యెనుబదిమూఁడు దుర్గముల నాక్రమించుకొనిరి. రాణా ప్రతాపుఁ డొకనాఁడు మంత్రులతో నాలోచించి, తన విజయమునకు గుర్తుగాఁ దన రాజ్యమునకు సమీప రాజ్యమం దలి యొక పట్టణమును బ్రజలకు హానిఁ గలుగకుండఁ గొల్ల గొట్ట నిశ్చయించెను. మానసింహుని యంబరు రాజ్యమందలి మాల్పురమను పట్టణమును శూన్యమొనర్చి ధనధాన్యాదులను గోటఁ జేర్చుకొనెను. ఈ వార్త మానసింహుని యభిమానమునకు వేరుపురుగయ్యెను. కాని యేమిచేయఁగలఁడు?

శుభదినమునఁ బ్రతాపసింహుఁడు పత్నీపుత్రులతో, బంధువులతో, మంత్రిసామంతులతో భవానీదేవి కోవెల కేగి, పూజచేయించి, భవానీదేవికి వజ్రకిరీటము కానుకగా నొసఁగి దీవన లందుకొనెను. కొలువుకూటమున మఱునాఁటి మధ్యాహ్నమున సామ్రాజ్య పట్టాభిషేకము జరిగింప నిర్ణయింపఁ బడియుండెను.

రాజపుత్రవంశ చరిత్రలు కొలువుకూటమునఁ గుడ్యములపైఁ జెక్కింపఁబడి యుండెను. ముహూర్తసమయమున

నెల్లరు గొలువుకూటముం జేరిరి. వేదికపై సింహాసనము నమర్చిరి. సింహాసనమున కీవల గద్దెలపైఁ బ్రతాపుఁడు, సామంతులు, బంధులు, మిత్రులు, కృష్ణసింహుఁడు, భీమచాందు, భామాసాహి యుచితాసనముల నుండిరి. వేదమంత్రములుచ్చరింపఁబడుచుండెను. పాటేశ్వరీ ప్రతాపులచేఁ బూజలు చేయించి శుభముహూర్తమున వారిని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి యభిషేకము గావించిరి. వందిమాగధులు కైవారముసేయుచుండ సామంతులు కానుకలర్పించిరి. భీమచాందు మంచిముత్యముల బహుమానముతోఁ దనియఁ జేసెను.

రాణా ప్రతాపసింహుఁ డాసనమందుండి లేచి యంజలి మోడ్చి "సోదరులారా! మన స్వాతంత్ర్య పిపాసను దన దండయాత్రలలో వృద్ధిఁజేసి, మనకుఁ గీర్తిప్రతిష్ఠలఁ గలిగించిన యక్బరును రక్షింప నీ శుభసమయమున భగవంతునిఁ బ్రార్థించుచున్నాను. మన స్వాతంత్ర్యమును సాధించుటకుఁ బ్రాణముల ధారవోసిన వీరాధివీరుల యాత్మశాంతికి దేవునిఁ బ్రార్థించుచున్నాను. ఇప్పుడు మనము స్వాతంత్ర్యమందిరపు వాకిలియొద్దకుఁ జేరితిమి. కాని గృహప్రవేశము జరుగలేదు. యావద్రాజపుత్ర దేశము నొక ప్రాటిమీఁద నడిపించుటకుఁ గృషిసేయవలసియున్నది. కుంభరాణా మొదలగు మన పూర్వ నృపాలు రేలిన దేశము మన పాపుటాక్రిందకు రావలయును. అంతవఱకు మనకు విశ్రాంతిలేదు. మన ప్రాచీనవైభవమునకుఁ గాణాచియగు చిత్తూరుపురమును దిరిగి సాధించి తీఱవలయును. నా రక్తములోఁ బ్రత్యణువు చిత్తూ

ఱును గలవరించుచున్నది.'' అని పలికి భామాసాహిదగ్గఱకుఁ బోయి నమస్కరించి, "మంత్రీశ్వరా! నీ పాదపద్మములు సేవ్యములు. నీ చల్లనిచూపులతో మమ్ముఁ గాపాడుచున్నావు. ఈ రాజ్యలక్ష్మి నీ ప్రసాదము. వైశ్యవంశపయోధికిఁ జంద్రుఁడవైన నీ పెల్లప్పుడిందుండవలె''నని ప్రార్థించి యాతని నుచితరీతిని గౌరవించెను.

పిమ్మటఁ బ్రతాపుఁడు, భీమచాందు దరికేగి కౌఁగలించి కొని "ఇరువదైదేండ్లనుండి నా కష్టముల నాదుకొని నన్నుద్ధరించిన మిత్రశేఖరుఁడవు. నీ ఋణ మెట్లు దీర్చుకొందు''నని పల్కి సమ్మానించెను.

అనంతరము సలుంబ్రా కృష్ణసింహునిఁ జేరి మ్రొక్కి, "తండ్రీ! నా తండ్రివెనుకఁ దండ్రివలె నన్నోమితివి. నీ నీతి విద్యతో నా యాపదలను మఱచిపోవఁజేసిన నీ యట్టి యుత్తముని ఋణము జన్మజన్మలకుఁ దీర్చుకోఁగలనా!'' యని పలికెను.

భామాసాహి లేచి ప్రతాపుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి "దేవా! నీ చరిత్ర నిష్కల్మషమైనది. నీ జీవితమే దేశచరిత్ర! భారతీయులను రక్షింప నవతరించితివి. నీ సమకాలీనుల మన్న కీర్తి మాకు దక్కించిన భగవంతునకుఁ గృతజ్ఞులము.'' అని పలుక జయజయ ధ్వానములతో సభ ముగిసెను.

# 13. అవతార సమాప్తి

హాల్దీఘాటు సమరమునఁ దగిలిన గాయములవలన, పిదపఁ గలిగిన కష్టపరిస్థితులవలనఁ బ్రతాపుని శరీర మనా రోగ్యముతో నిండియుండెను. స్వాతంత్ర్య దినోత్సవము జరి గిన పిదప నెన్నోనాళ్లు రాణా యారోగ్యము చక్కఁగ లేదు. అమరసింహునిపై రాజ్యభారము మోపి రాణా విశ్రాంతిఁ గైకొనుచుండెను.

క్రమక్రమముగా రాణా యారోగ్యము చెడెను. ఆయన మంచముఁ బట్టెను. ఘనవైద్యులు చికిత్సకై నియ మింపఁబడిరి. బంధుమిత్రులు, మంత్రిసామంతులు మంచము చుట్టు మూఁగిరి. ప్రతాపున కున్నటులుండి స్మృతి తప్పెను. ఎల్లరు విషాదవదనులై యుండిరి. అందులో నొకఁడు రామ నామము స్మరింపవలసినదని మనవిచేసెను. అప్పుడు రాణా గంభీరధ్వనితో "నాయనా! నా కేల యీ రామనామము! చిత్తూరును యవనహస్తములనుండి కాపాడలేక పోయితినే యను చింత యొక్కటి మాత్రమే మిగిలినది. మీ రంద ఱొక్కమాఱు కత్తులనెత్తి యేకకంఠముతోఁ జిత్తూరును సాధింతుమనియు, మన పవిత్రదేశమును విదేశీయులబారి నుండి రక్షించెద మనియుఁ బ్రతిజ్ఞలను గావింపుఁడు. నేను నిశ్చింతగఁ గన్నుమూసెదను. నా కొఱకై విచారింపకుఁడు. అదిగో! చిత్తూరు రాజ్యలక్ష్మి బానిస సంకెళ్లలోఁ దగులు కొని యగుపించుచున్నది. సాహాయ్యమునకై, బంధవిముక్తికై బిగ్గఱగా విలపించుచున్నది. నాయనా! అమరసింహా! నా

కోర్కెఁ దీర్చెదనని ప్రతినఁజేయు'' మనెను. వెంటనే యమరసింహుఁడు ప్రతిజ్ఞయొనర్చి, సూర్యధ్వజమునకు నమస్కరించెను. ప్రతాపుని ప్రాణవాయువులు పంచభూతములలో లీనమైనవి. రాణా ప్రతాపుని వీరచరిత్ర భారతదేశ చరిత్రమున సువర్ణలిపిలో వ్రాయఁబడినది. హారావళీ పర్వతము లీనాఁటికిని ప్రతాప స్వాతంత్ర్య సంగ్రామమును వేనోళ్లఁ జాటుచున్నవి. ప్రతాపుని కీర్తియు, నక్బరు మానసింహాదుల యపకీర్తియు నజరామరములైనవి. భామాసాహి త్యాగవృత్తము మహోదాత్తము. కృష్ణసింహ పృథ్వీరా జాబ్దుర్ రహీమానుల చరిత్ర స్వతంత్ర భారతమున కలంకారము. పాటేశ్వరి జగద్వంద్యయగు వీర పతివ్రతాతిలకము. భామాసాహ, భీమచాందు, కృష్ణసింహాదుల స్వామిభక్తిపరాయణత విశ్వమున కాదర్శప్రాయము.